

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## Journal of the Telugu Academy

**KAKINADA**



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

సంపుటము ౪౯ | సంచిక ౪
Vol 49 | Part 4

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి ఇ., డి లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

(జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు.)



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

సంవత్సరము చందా రు 3-0-0

సంపుటము ౪౯ శార్వరి-ఆశ్వయుజ-కార్తికములు. సంచిక ౪

Vol 49 Part 4

విషయసూచిక

# సంపాదకీయము

కడచిన 'సంచికను శ్రీ జయంతి రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవ స్మారక సంచికగా వెలువఱుచుట మూలముగ, ఈ నాలుగవ సంచిక వెలువడుటలోఁ గొంత యాలస్యమయినది. ఈ సంచిక వెలువఱుచు యత్నములో నుండఁగా, ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులు, ఆంధ్రప్రదేశ ఆస్థానకవీశ్వరులు భారత భాగవత రామాయణాది శతాధిక గ్రంథకర్తలు మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమేత్యాది బిరుదాంచితులు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రాజమహేంద్రవరమున స్వగృహమునందు పుష్యశుద్ధ ఏకాదశి బుధవారము (28-12-60) రాత్రి నాలుగు గంటలకు వారి తొంబదియైదవ సంవత్సరమున దివంగతులగుట తటస్థించినది. శాస్త్రిగారు దీర్ఘాయుష్కులై దివంగతులయినను వారి నిర్యాణము వలనఁ బరిషత్తునకుఁ దీఱని నష్టము వాటిల్లినదనుట నిర్వివాదము. వారి మరణమునకు సంతాపమును వెల్లడించుచుఁ బరిషత్తు కార్యనిర్వాహక వర్గము సంతాప తీర్మానమును బ్రతిపాదించి, శాస్త్రిగారి కుటుంబమునకు సానుభూతిని నివేదించుకొనియున్నది. రాఁబోవు సంచికను శ్రీ శాస్త్రిగారి ప్రత్యేక స్మారక సంచికగా వారి జీవితచరిత్ర కృతివిశేష విషయములతో వెలువఱించుటకుఁ బరిషత్తు తీర్మానించియున్నది. కావున భాషాభిమానులెల్లరు నీ విషయమునఁ బరిషత్తునకు సహకరించి, తమ కభిమతమైన వ్యాసములను త్వరలో రచించి పరిషత్కార్యాలయమునకుఁ బంపఁ బ్రార్థించుచున్నాము.

ఇట్లు,

సంపాదకుఁడు.

# పాతఞ్జలమహాభాష్యము——పస్పశాహ్నికము

శ్రీభాష్యం అప్పలాచార్య.

(గతసంచిక తరువాయి)

మూ. అథవాకింన ఏతేన ? ఇదం నిత్యమిద మనిత్యమితి। యన్నిత్యం తం పదార్థం మత్వైష విగ్రహః క్రియతే సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి।

లేదా-ఇది నిత్యము ఇది అనిత్యము అని ఈ విచారణము మన కెందులకు? ఏదినిత్యమో దానినే పదార్థముగ తలఁచి శబ్దము,అర్థము, సంబంధము సిద్ధములు అని-విగ్రహ వాక్యము కల్పింపఁబడినది.

మూ. కథం పునర్జ్ఞాయతే-సిద్ధః శబ్దోఽర్థః సంబంధశ్చేతి।

శబ్దము, అర్థము, సంబంధము అనుమూఁడును సిద్ధములు (నిత్యములు) అని ఎట్లు తెలియుచున్నది ?

మూ. లోకతః।

యల్లోకేఽర్థ ముపాదాయ శబ్దాన్ప్రయుంజతే, నైషాం నిర్వృత్తౌ యత్నం కుర్వంతి । యేపునః కార్యాః భావాః నిర్వృత్తౌ తావ త్తేషాం యత్నః క్రియతే. తద్యథా-ఘటేన కార్యం కరిష్యన్ కుంభకారకులం గత్వాహ. కురు ఘటం కార్యమనేన కరిష్యా మీతి, న తద్వచ్ఛబ్దాన్ప్రయు యుక్షమాణో వైయాకరణకులం ప్రయోక్ష్య ఇతి। గత్వాహ-కురుశబ్దాన్. తావత్యే వార్థ ముపాదాయ శబ్దాన్ప్రయుంజతే।

లోకము వలన — ఏమన —

లోకమున నాయాయర్థములను మనసున గ్రహించి దాని కను వగు శబ్దములను ప్రయోగించుచున్నారు. కాని వాని నిర్మాణమున ప్రయత్నమును జేయుట లేదు. కుండతో పని చేయఁదలచిన వాఁడు కుమ్మరి యింటికి పోయి 'నాకు పనియున్నది కుండను చేసి యిమ్ము'

అని యడిగినట్లు శబ్దములను ప్రయోగింపఁ దలఁచినవాఁడు వైయాకరణు నింటికి పోయి 'నేను శబ్దములను ప్రయోగింపవలెను. తయారు చేసి యిమ్ము' అని యడుగుట లేదు. ఆయా యర్థములను గ్రహించి తమంత తామే శబ్దములను ప్రయోగించు చున్నారు.

మూ. యది తర్హి లోక ఏషు ప్రమాణమ్, కింశాస్త్రేణ క్రియతే ?

అ. లోకమే శబ్దముల విషయమున ప్రమాణ మయిన, మఱి యీ వ్యాకరణ శాస్త్రమెందులకు ?

మూ. లోకతోఽర్థ ప్రయుక్తే శబ్ద ప్రయోగే శాస్త్రేణ ధర్మ నియమః క్రియతే।

అ. ఇతరున కర్థజ్ఞానము కలుగుటకై లోకవ్యవహారము ననుసరించి శబ్దము ప్రయోగింపఁబడును. శబ్దప్రయోగమట్లు లోకముచేతనే సిద్ధించినను, శాస్త్రము శబ్దములను ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి సుశబ్దములుగ నిరూపించి వానిని ప్రయోగించుటయే ధర్మమని నియమించును.

మూ. కిమిదం ధర్మనియమ ఇతి ? ధర్మాయ నియమః ధర్మనియమః, ధర్మార్థో వా నియమః ధర్మనియమః, ధర్మప్రయోజనో వా నియమః ధర్మనియమః॥

అ. "శాస్త్రము ధర్మనియమమును జేయును" అని చెప్పిరి కదా ! ధర్మనియమమనుచోట విగ్రహ వాక్యమేమి? ధర్మము కొఱకు నియమము ధర్మనియమము అని కాని ధర్మప్రయోజనమగు నియమము ధర్మనియమము అని కాని విగ్రహ వాక్యమును చెప్పవలెను.

వి. ధర్మము కొఱకు నియమము అనఁగా ధర్మమునకైన (ధర్మమును కలిగించుట ప్రయోజనముగాఁ గల) నియమము అని యర్థము. దీనిని సంస్కృతమున తాదర్థ్య చతుర్థి యందురు. కాని యీ యర్థ

మున షష్ఠీ తత్పురుషమే కాని చతుర్థీ తత్పురుషము పొసగదని భాష్య కారుని యాశయము. అందుచే కర్మధారయ సమాసమును జెప్పెను.

'ధర్మార్థమగు నియమము'అనునది కర్మధారయ సమాసము. ధర్మము అను నర్థము గల నియమమును శాస్త్రము చేయును. ఈ నియమమే ధర్మమని భావము.

మీమాంసకుల మతములోన పురుషుని క్రియలో ప్రవర్తింపఁ జేయు నియోగమే 'లిఙ్' మొదలగు వాని యర్థము. కావున అట్టి పురుష ప్రవర్తకమగు ధర్మమే నియమము. అట్లు పురుష ప్రవృత్తి హేతుభూతమగు నియమమును జేయును.

కాఁగా వ్యాకరణ శాస్త్రము 'ధర్మముకొఱకు సాధుశబ్దములనే ప్రయోగింపవలె'నని నియమము చేయును.

లేదా శబ్దములను ప్రయోగించుటయే ధర్మము అను నియమ మును చేయును.

లేదా పురుషునిసాధుశబ్దములనే ప్రయోగించునట్లు ప్రవర్తింపఁ జేయును.

మూ. యథా లౌకిక వైదికేషు

(లౌకికము) లోకమునందును, (వైదికము) వేదమునందును మఱియొక విధముగ సిద్ధించిన దానికిఁ గూడ నియమములను చేయు నట్లే యిందును వ్యాకరణము నియమమును చేయును.

మూ. ప్రియతద్ధితా దాక్షిణాత్యాః-యథా'లోకే వేదేచే'తి
ప్రయోక్తవ్యే 'యథా లౌకిక వైదికేష్వి'తి ప్రయుఞ్జతే।
అథవా యుక్త ఏవాత్ర తద్ధితార్థః। యథాలౌకికేషు
వైదికేషు చ కృతాంతేషు।

అ. "లోకమునందును, వేదమునందును" అనుటకు బదులు లౌకిక వైదికములు' అని తద్ధితాంతములు వాడుట 'దాక్షిణాత్యులు

తద్ధిత ప్రియులగుట వెల్లడి చేయుచున్నది.

లేదా లౌకికములగు సిద్ధాంతములందును, వైదికములగు సిద్ధాంతము లందును లోకముచే సిద్ధించిన దానిని శాస్త్రము నియమించినటు లనే-యని చెప్పుటకు లౌకిక వైదిక శబ్దములను వాడియుండును. కావున తద్ధితాంతములను వాడుటయు సమంజసమే.

మూ. లోకే తావద్ అభక్ష్యో గ్రామ్య కుక్కుటః అభక్ష్యో గ్రామ్య సూకర ఇత్యుచ్యతే. భక్ష్యంచ నామ క్షుత్ప్రతిఘాతార్థముపాదీయతే శక్యం చానేన శ్వమాంసాది రపి క్షుత్ప్రతిహన్తుమ్తత్ర నియమః క్రియతేఇదంభక్ష్య మిదమభక్ష్యమితి. తథా ఖేదాత్ స్త్రీషు ప్రవృత్తి ర్భవతి। సమానశ్చ ఖేద విగమో గమ్యాయాం చాగమ్యాయాంచ । తత్రనియమః క్రియతే. ఇయం గమ్యా ఇయ మగమ్యా ఇతి॥

అ. "గ్రామ్య కుక్కుటము, గ్రామ్య సూకరము తినరానివి" అను నియమము కానవచ్చుచున్నది. ఆకలిని దీర్చుకొనుటకు ఆహారమును దీసికొనుట లోకసిద్ధమే. కుక్క మాంసముచే తనైనను ఆకలిని తీర్చుకొనవచ్చును. అట్టిచో శాస్త్రము నియమము చేయుచున్నది. "ఇది తినఁ దగినది-ఇది తినఁ దగనిది" అని.

అట్లే ఇంద్రియ నియమము చేసికొనలేక ఖేదమును దీర్చుకొనుటకు స్త్రీ ప్రవృత్తి కలుగును. ఖేదనివృత్తి గమ్యయైనను అగమ్యయైనను సమానమే. అయినను శాస్త్రము నియమముచేయును. ఈమె గమ్య ఈమె యగమ్య యని ఇట్లు లోకమున సిద్ధములగు విషయముల శాస్త్రము నియమము చేయుచున్నది.

మూ. వేదే ఖల్వపి-"పయోవ్రతో బ్రాహ్మణో యవాగూవ్రతో రాజన్య ఆమిక్షావ్రతో వైశ్యః ఇత్యుచ్యతే॥ వ్రతంచ నామ అభ్యవహారార్థముపాదీయతే। శక్యం చానేన శాలి మాంసాదీన్యపి వ్రతయితుమ్. తత్రనియమః క్రియతే।

తథా:- "బైల్వః ఖాదిరో వా యూపః స్యాత్" ఇత్యుచ్యతే యూపశ్చనామ పశ్వనుబంధార్థ ముపాదీయతే. శక్యంచా నేన యత్కించిదేవ కాష్ఠ ముచ్ఛ్రిత్యానుచ్ఛ్రిత్య వా పశు రనుబంధుమ్. తత్రనియమః క్రియతే॥తథా "అగ్నౌక పాలాన్య ధిశ్రిత్యాభి మంత్రయతే-భృగూణా మంగిరసాం ఘర్మస్య తపసా తప్యధ్వం ఇతి. అంతరేణాపి మంత్ర మగ్నిర్దహనకర్మా కపాలాని సంతాపయతి.తత్రచ నియమః క్రియతే-ఏవం క్రియ మాణ మభ్యుదయకారి భవతి ఇతి॥

అ. వేదములో కూడ నిట్లే సహజ సిద్ధములగు వానిని నియ మించుట కానవచ్చును. బ్రాహ్మణుఁడు పాలతోనే వ్రతము నాచరింప వలెను.క్షత్రియుఁడుయవాగువుతో వ్రతము నాచరింపవలెను.వైశ్యుఁడు ఆమిక్షముతో వ్రతము నాచరింపవలెను.వ్రతము అనఁగాఆహారముగా తీసికొనుట పాలు, యవాగువు,ఆమిక్షమే కాక శాలి ధాన్యము, మాం సము మున్నగు వానిని గూడ ఆహారముగఁ దీసికొనవచ్చును. కాని అచట నియమమును చేయుచున్నాఁడు.

అట్లే-బిల్వము (మారేడుకఱ్ఱ) కాని ఖదిరము (చంద్రకఱ్ఱ) గాని యూపముగా నుండవలెను. అని శాస్త్రము చెప్పుచున్నది. యూపము యజ్ఞమున పశువును కట్టుట కుపయోగించు స్తంభము. ఏకఱ్ఱయైనను అది చెక్కిన దైనను చెక్కనిదైనను పశువును కట్టుటకు పనికి వచ్చును గదా! కాని శాస్త్రము ఇట్టి స్తంభమే యుపయోగింపఁ దగినదని నియమము చేయుచున్నది.

అట్లే-కపాలముల నగ్నియందుంచి వెచ్చఁజేయుచు "భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వమ్" అను మంత్రముచే నభిమంత్రణము చేయవలెను. అని శాస్త్రము నియమించు చున్నది.

మంత్రమును జదువకయే యగ్నియందుంచినను దహించు స్వభా

వము గల యగ్ని కపాలములను వేడిచేయక మానదు. అయినను నియమము చేయుచున్నది. "ఈ మంత్రముచే నభిమంత్రించి తాపమును కలిగించిననే యభ్యుదయము కల్గును-" అని

మూ. ఏవ మిహాపి సమానాయా మర్థా వగతౌ శబ్దేన చాపశబ్దేనచ ధర్మనియమః క్రియతే. శబ్దేనై వార్థోఽభిధేయో నాఽపశబ్దే నేతి॥ఏవంక్రియమాణ మభ్యుదయకారి భవతీతి॥

అ. అట్లే వ్యాకరణ శాస్త్రము కూడ-శబ్దము అపభ్రంశము గూడ అర్థవ్యక్తీకరణమున సమానములే యయినను ధర్మమునకై నియమమును చేయుచుండును "సాధుశబ్దము చేతనే అర్థమును ఆవిష్కరింపవలెను. కాని అపశబ్దములచేత నావిష్కరింపరాదు. అట్లు చేసిన నాఁడే అభ్యుదయము కలుగును" అని

వి. వ్యాకరణ శాస్త్రము శబ్దములను క్రొత్తగా సృష్టించునది కాదు. శబ్దములు లోకవ్యవహారము చేతనే సిద్ధములగు చుండును. కాని వ్యాకరణము "ఇవియే ప్రయోగింపఁదగు శబ్దములు" అని నియమమును మాత్రమే చేయును. అట్లు సాధుత్వము నెఱింగి ప్రయోగించుటచేతనే యభ్యుదయము జనించును.

భోజన విహారాదులు స్వభావసిద్ధములే యయినను, 'ఇవియే తినఁదగినవి-వీరే విహరింపఁదగినవారు అనియెట్లు నియమములు లోకమున నున్నవో- యజ్ఞకర్మలలో యూపస్తంభాదులకే కట్టు యుపయోగించినను పని సాగినను ఎట్లు నియమము చేయుచున్నారో అట్లే వ్యాకరణమునఁగూడ లోకముచే శబ్దప్రయోగము సిద్ధించినను వీనినే ప్రయోగింపవలెను అని నియమము చేయును.

అప్రయుక్త శబ్దసాధకశాస్త్ర సార్థక్యాధికరణమ్.

మూ. అస్త్యప్రయుక్తః సంతివై శబ్దా అప్రయుక్తాః. తద్యథా-

ఊష, తేర, చక్రి, పేచేతి. కిమతో యత్సంత్యప్రియుక్తాః? ప్రయోగాద్ధి భవాన్ శబ్దానాంసాధుత్వ మధ్యవస్యతి. య ఇదానీమప్రియుక్తా నామీ సాధవః స్యుః.

అ. లోకవ్యవహారమున లేనిశబ్దములును గలవు. ఊష, తేర, చక్రి మున్నగునవి వ్యాకరణమున సాధింపఁబడినను వ్యవహారమున లేవు గదా ! ప్రయోగము లేకపోయిన నష్టమేమి ? లోకములో ప్రయోగించుటవల్లనే గదా శబ్దముల సాధుత్వము నెఱుంగవలయును. ప్రయోగమున లేని శబ్దములు అసాధువు లేకదా !

వి. వెనుకటి వార్తికమువలన-ప్రయోగమున సాధ్వసాధుశబ్దములు రెండును గానవచ్చుచుండ సాధుశబ్దములను ప్రయోగించుటచేత ధర్మమని శాస్త్రము నియమముచేయును. అని తెలిపెను. లోకములో ప్రయోగింపఁబడిన తరువాత అది సాధువని యెఱింగివ్యాకరణమునందు నియమము చేయవలెను. లోకమున ప్రయోగింపఁబడని శబ్దములను వ్యాకరణ మనుశాసించుట యప్రమాణమేకదా !

1. ఊష-నివసించితిరి-అను నర్థమున 'వస' ధాతువు యొక్క-లిట్టు మధ్యమ పురుష బహువచనము-దీని ప్రయోగము కానరాదు.

2. తేర-దాటితిరి తౄధాతువు-లిట్టు-మ-పు-బ

3. చక్ర-చేసితిరి కృధాతువు లిట్టు-మ-పు-బ

4. పేచ-వండితిరి-పచ-ధాతువు లిట్టు-మ-పు-బ

మూ. ఇదం తావద్విప్రతిషిద్ధమ్-యదుచ్యతే-సంతి వై శబ్దా అప్రయుక్తా ఇతి।యది సంతి నాప్రయుక్తాః అథాప్రయుక్తాః నసంతి. సంతి చాప్రయుక్తా శ్చేతి విప్రతిషిద్ధమ్। ప్రయుంజాన ఏవఖలు భవానాహ సంతిశబ్దా అప్రయుక్తా ఇతి।క శ్చేదానీ మన్యోభవజ్జాతీయకః పురుషః శబ్దానాం ప్రయోగే సాధుః స్యాత్ ?॥

అ. "అప్రియుక్తములైన శబ్దములు కలవు" అనుటయే అసంగ

తము. శబ్దము ఉన్నది అని యంగీకరించినచో నది యప్రియుక్తము కానేరదు. అప్రియుక్తమైనచో నుండుట పొసగదు. 'అప్రయుక్తముగా నున్నది' యనుట పరస్పర విరుద్ధము.

నీకంటె నితరుఁడు వేఱొకఁ డెవఁడు శబ్దములను ప్రియోగించుట కర్హుఁడు ? (నీవు ప్రియోగించితివి చాలదా ?)

వి. శబ్దము ఉండుట యనఁగా లోకవ్యవహారమున నుండుట 'లేకుండుట' యనఁగా వ్యవహారమున లేకుండుట.అందుచే శబ్దమున్నది యనిన ప్రియోగింపఁబడినది యని యర్థము కావున అప్రియుక్తము అనుట పొసగదు.వ్యాకరణమున సాధింపఁబడినదే కాని ప్రియోగమున లేదని ప్రశ్నించు వాని యభిప్రాయము. ఏ యొక్కఁడు ప్రియోగించినను ప్రియోగమున్నట్లే కావున నీవిపుడు ప్రయోగించుటచే ప్రయుక్తమైనట్లే యని చమత్కారముగ సమాధానము నిచ్చెను.

మూ. నైత ద్విప్రతిషిద్ధమ్। సంతీతి తావద్ బ్రూమః। యదేతాన్ శాస్త్రవిదః శాస్త్రేణానువిదధతే । అప్రయుక్తా ఇతి బ్రూమః యల్లోకే:అప్రియుక్తా ఇతి. యదప్యుచ్యతే-కశ్చేదానీమన్యో భవ జ్జాతీయకః పురుషః శబ్దానాం ప్రియోగే సాధుః స్యాత్ ఇతి. నబ్రూమః అస్మాభిర ప్రి యుక్తా ఇతి కింతర్హి ? లోకే ఽ ప్రియుక్తా ఇతి.

అ. 'అప్రియుక్తములగు శబ్దములు కలవు' అనుట పరస్పర విరుద్ధము కాదు. శాస్త్రకారులు వ్యాకరణ శాస్త్రమున వీనిని సాధించినారు కావున "కలవు' అని చెప్పితిమి. లోకమున ప్రయోగింపఁబడ లేదు కావున "అప్రయుక్తములు" అంటిమి. నీ కంటె వేఱొకఁ డెవఁడైన ప్రయోగింపవలెనా ? నీవు చాలవా ?" అని యందురేమో" మేము ప్రయోగించ లేదు" అనలేదు. లోకమున ప్రయోగింపఁబడ లేదని మనవి చేయుచున్నాము.

మూ. ననుచభ వానప్యభ్యంతరో లోకే॥

అ. నీవు కూడ లోకములోని వాఁడవే కదా.

మూ. అభ్యంతరోఽహంలోకే, నత్వహం లోకః.

అ. నేను లోకములోని వాఁడను కాని, నేను లోకము కానుగదా!

వి. నేను లోకములోని వాఁడనే-నేను ప్రయోగించినను ప్రయుక్తములే యగును. కాని యిచట నేను "ఊష, తేర, చక్ర, పేచ" మొదలగు వాని నొక యర్థము నిచ్చుటకు వాడలేదు. అర్థరహితముగ శబ్దస్వరూప నిరూపణమునకు ప్రయోగించితిని. అర్థబోధకై ప్రయోగించిననాఁడు నేను ప్రయోగించినను ప్రయుక్తములే యగును. నేనట్లు ప్రయోగింపలేదు కనుక పై శబ్దములు నేను ప్రయోగించినను లోకముచే ప్రయోగింపఁబడలేదు కనుక అప్రయుక్తములే-కాని శాస్త్రమందుఁగలవు. లోకమున వ్యవహారమున లేని శబ్దములను సాధించుటలో శాస్త్రమెంతవఱకు ప్రమాణము అగును ?

మూ. అస్త్యప్రయుక్త ఇతిచే న్నార్థే శబ్దప్రయోగాత్॥

అస్త్యప్రయుక్త ఇతి చేత్ తన్న. కింకారణమ్ ? అర్థే శబ్దప్రయోగాత్. అర్థే శబ్దాః ప్రయుజ్యంతే సంతిచైషాం శబ్దానా మర్థాయేష్వర్థేషు ప్రయుజ్యంతే.

అ. అప్రయుక్తములు కలవు అనుట పొసగదు. అర్థములను తెలియఁజేయుటకు శబ్దములుండియే తీరును గదా! శబ్దము అర్థమును తెలియఁజేయుటకై ప్రయోగింపఁబడును. 'ఊష, తేర' మొదలగు శబ్దముల యర్థము లున్ననాఁడు ఆశబ్దములును ప్రయోగింపఁబడియే యుండవలెను.

మూ. అప్రయోగః ప్రయోగాన్యత్వాత్॥

అప్రయోగః ఖల్వప్యేషాంశబ్దానాం న్యాయ్యః. కుతః ప్రయోగాన్యత్వాత్ యదేషాం శబ్దానామర్థే అన్యాన్ శబ్దాన్ ప్రయుంజ

తే॥ తద్యథా-ఊషేత్యస్య శబ్దస్యార్థే-క్వయూయ ముషితాః. తే రే త్యస్యార్థే-క్వయూయం తీర్ణాః. చ క్రేత్యస్యార్థే క్వయూయం కృత వంతః. పేచేత్యస్యార్థే-క్వయూయం పక్వవంత ఇతి॥

అ. "ఊష, తేర" మొదలగు శబ్దము లప్రయుక్తములనుట న్యాయ్యమే, ఎందుచేత ? ఆ యర్థములను తెలియఁజేయుటకు లోకము "ఊష, తేర" మొదలగు శబ్దములను గాక వేఱొక శబ్దములను వాడు చున్నది.

ఊష:-నివసించితిరి అను నర్థమున-మీా రెచట నివసించిన వారలు ? క్వయూయం ఉషితాః అను పదమును ప్రయోగించు చున్నారు.

అట్లే తేర-తరించితిరి అను నర్థమున క్వయూయం తీర్ణాః మీా రెచట తరించిన వారలు అనియు

చక్ర-చేసితిరి యనునర్థమున క్వయూయం కృతవంతః మీా రెచట చేసిన వారలు అనియు

పేచ:- వండితిరి యను నర్థమున క్వయూయం పక్వవంతః మీా రెచట వండిన వారలు అనియు ప్రయోగించు చున్నారు.

కావున ఊష, తేర, చక్ర, పేచ, యనునవి యప్రయుక్తములే.

మూ. అప్రయుక్తే దీర్ఘ సత్రవత్॥

యద్యప్య ప్రయుక్తాః అవశ్యం దీర్ఘ సత్రవల్లక్షణే నాను విధేయాః తద్యథా దీర్ఘసత్రాణి వార్షశతికాని వార్షస హస్ర కాణిచ. నచాద్యత్వే కశ్చిదప్యాచరతి. కేవల మృషిసంప్ర దాయో ధర్మ ఇతి కృత్వా యాజ్ఞికాః శాస్త్రేణానువిదధ తే॥

అ. అప్రయుక్తములైనను దీర్ఘ సత్రయాగమువలె శాస్త్రము చెప్పియే తీరవలెను.

ఊష, తేర మొదలగునవి ప్రయుక్తములు కాకపోయినను కల్ప సూత్రములందు దీర్ఘ సత్రయాగమును వివరించునటుల నే వ్యాక

రణము లక్షణముచే సాధించియే తీరవలెను. దీర్ఘ సత్త్రియాగము నూరు సంవత్సరములు లేక వేయి సంవత్సరములు చేయవలసిన యాగము. ఈ కాలమున నెవఁడును అంత దీర్ఘకాలము చేయవలసిన యాగమును చేయఁజాలరు. కేవలము అధ్యయనము మాత్రము చేతనైనను ధర్మము సంభవించునని తలంచి యాజ్ఞికులు అను శాసింతురు.

వి. దీర్ఘ సత్రము నేఁటి కాలమున నాచరణమున లేకపోయినను అధ్యయన మాత్రమున నైనను ధర్మము కలిగించుటకును, సంప్రదాయ విచ్ఛేదము కాకుండుటకును ఎట్లు కల్పమునఁ జెప్పఁబడునో అట్లే "ఊష తేర" మొదలగు శబ్దములు నేఁడు ప్రయుక్తములు కాకపోయినను సంప్రదాయ విచ్ఛేదము కాకుండుటకై లక్షణము సాధించియే తీరవలెను.

మూ. సర్వే దేశాంతరే॥

సర్వేఖల్వప్యేతే శబ్దా దేశాంతరేషు ప్రయుజ్యంతే.

అ. పై శబ్దములన్నియు నితర దేశములందు ప్రయోగింపఁబడుచుండును.

మూ. నచైవోపలభ్యంతే.

ఇవి ప్రయోగమునఁ గానరావే.

మూ. ఉపలబ్ధౌ యత్నః క్రియతామ్. మహాన్ శబ్దస్య ప్రయోగ విషయః. సప్తద్వీపా వసుమతీ, త్రయో లోకాః, చత్వారో వేదాః సాంగాః సరహస్యా బహుధా భిన్నాః. ఏకశత మధ్వర్యుశాఖాః, సహస్ర వర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యం, నవధా థర్వణో వేదః, వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మిత్యే తావాన్ శబ్దస్య ప్రయోగవిషయః. ఏతావంతం శబ్దస్య ప్రయోగవిషయ మననునిశమ్య "సంత్య ప్రయుక్తా" ఇతి వచనం కేవలం సాహసమాత్రమేవ.

అ. ప్రయోగమును కనుఁగొనుటకుఁ బ్రయత్నము చేయుఁడు,

ప్రయత్నము చేయకయే ప్రయోగము లేదనరాదు. శబ్దమునకు ప్రయోగవిషయ మతివిశాలము. ఏడు ద్వీపములతో నిండిన భూమండలము, మూడు లోకములు, సాంగములు సరహస్యములు నగునాల్గు వేదములు, అందులో 101 అధ్వర్యు శాఖలు, నూరు సామవేద శాఖలు, 21 బహ్వృచ శాఖలు, 9 ఆధర్వణ శాఖలు, వాకోవాక్యము (ఉక్తి ప్రత్యుక్తిరూపమున నుండు ఉపనిషదారణ్యకాదులు) ఇతిహాసము, పురాణము వైద్యము మొదలగున వెన్నియో ప్రయోగమునకు విషయము లుండఁగా వాని నన్నింటిని పరిశీలింపక "అప్రయుక్తములు" అనుట కేవలము సాహసమే.

మూ. ఏతస్మింశ్చాతిమహతి శబ్దస్య ప్రయోగవిషయే తే తే శబ్దాః తత్ర తత్ర నియతవిషయా దృశ్యంతే. తద్యథా శవతి ర్గతి కర్మా కంబోజేష్వేవ భాషితో భవతి. వికార ఏవైన మార్యా భాషంతే శవఇతి. హమ్మతిః సురాష్ట్రేషు, రంహతిః ప్రాచ్య మధ్యమేషు, గమిమేవ త్వార్యాః ప్రయుంజతే. దాతిర్లవ నార్థే ప్రాచ్యేషు దాత్ర ముదీచ్యేషు.

అ. శబ్దముల ప్రయోగ విషయము ఇంతటి విశాలమైనదై యుండఁగా, కొన్ని శబ్దములు కొన్ని దేశములందే ప్రయోగింపఁబడుటను గూడ చూచుచున్నాము. 'శవ' అను ధాతువును కంబోజదేశములందు మాత్రము గమనము అను నర్థమున ప్రయోగింతురు. ఆర్యులు శవ శబ్దమును 'మృతశరీరము' అను నర్థమున వాడుదురు. ఆర్యులు గమనార్థమున "గచ్ఛతి" యను గమిధాతురూపమునే వాడుదురు. ఆ యర్థమున సురాష్ట్రదేశమునందు "హమ్మతి" అను ధాతురూపమును ప్రాచ్య మధ్యమ దేశములందు రంహతి అను ధాతురూపమును ప్రయోగింతురు. 'కోయుట' యను నర్థమున ప్రాచ్యదేశములందు 'దాతి' యనియును, ఉత్తరదేశములందు "దాత్రం" అనియును ప్రయోగింతురు.

మూ. యేచాప్యేతే భవతోఽప్రయుక్తా అభిమతాః శబ్దా ఏతేషామపి ప్రయోగో దృశ్యతే. క్వ ? వేదే తద్యథా "సప్తాస్యే రేవతీ రేవదూష, యద్వో రేవతీ రేవత్యాంతమూష, యన్మేనరః స్తుత్యం బ్రహ్మచక్ర, యత్రానశ్చక్రా జరసం తనూనామ్" ఇతి॥

అ. మీరు అప్రయుక్తములని పేర్కొనిన "ఊష, చక్ర"మున్నగు వానికిఁ గూడ ప్రయోగములు కన్పట్టుచున్నవి గదా ! ఎక్కడ ? వేదములో "సప్తాస్యే రేవతీ రేవదూష, యద్వో రేవతీ రేవత్యాం తమూష, యన్మే నరః స్తుత్యం బ్రహ్మచక్ర, యత్రానశ్చక్రా జరసం తనూనామ్" మున్నగు వాక్యములం దివి ప్రయుక్తములైనవి.

శబ్దజ్ఞానము ధర్మజనకము

మూ. కింపునః శబ్దస్య జ్ఞానే ధర్మః ఆహోస్విత్ప్రయోగే॥

అ. సాధుశబ్దముల నెఱింగిన మాత్రముననే ధర్మము కల్గునా ? లేక ప్రయోగించిననే ధర్మము కల్గునా ?

వి. లోకములో సాధ్వసాధుశబ్దములు వ్యవహరింపఁబడుచుండ 'నీయర్థమున నీ శబ్దము సాధువు' అని శాస్త్ర మనుశాసించును. శాస్త్రము ధర్మనియమము చేయునని వెనుక వివరించితిమి. ఆ ధర్మము శాస్త్రముచే సాధుశబ్దముల నెఱింగిన మాత్రముననే కల్గునా ? లేక ఎఱింగి ప్రయోగించిననే కల్గునా ? అను సందేహము నిచట నివారించుట కుపక్రమింపఁబడినది.

మూ. కశ్చాత్ర విశేషః

అ. అందులో భేద మేమి ?

మూ. జ్ఞానే ధర్మ ఇతిచే త్తథాఽధర్మః.

జ్ఞానే ధర్మ ఇతిచే త్తథాఽధర్మోఽపి ప్రాప్నోతి. యోహిశబ్దాన్ జానాతి అపశబ్దా నప్యసౌ జానాతి. యథైవ శబ్దజ్ఞానే ధర్మః ఏవ మపశబ్దజ్ఞానేఽప్యధర్మః.

అ. సాధుశబ్దముల జ్ఞానము చేతనే ధర్మము కల్గును అనిన, వాని కధర్మము కూడ తప్పక ప్రాప్తించును. శబ్దముల నెఱింగిన వాఁడు అప శబ్దములను కూడ తప్పక యెఱుంగును. శబ్దజ్ఞానముచే ధర్మము ప్రాప్తించునట్లే యపశబ్దజ్ఞానముచే నధర్మమును సంభవించును.

మూ. అథవా భూయా నధర్మః ప్రాప్నోతి. భూయాంసో హ్య పశబ్దాః అల్పీయాంసశ్శబ్దాః ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః తద్యథా గౌరిత్యస్య గావీ-గోణీ-గోతా-గోపోతలికే త్యేవమాద యోఽపభ్రంశాః.

అ. అంతేకాదు శబ్ద శాస్త్రజ్ఞునకు ధర్మము కంటె నధర్మమే యెక్కువగా ప్రాప్తించును. అపశబ్దములు ఎక్కువ-శబ్దములు తక్కువ కదా! ఒక్కొక శబ్దమున కెన్నో యపభ్రంశములుండును. 'గోవు' అను శబ్దమునకు 'గావి' 'గోణి' గోత 'గోపోతలిక' మున్నగు వెన్నియో అపభ్రంశములు.

మూ. ఆచారే నియమః

ఆచారే పునః ఋషిః నియమం వేదయతే- తేఽసురా హేలయో హేలయ ఇతికుర్వంతః పరాభభూవుః ఇతి

అ. వేదము ప్రయోగముననే ధర్మాధర్మములని నియమము చేయుచున్నది. "తేఽసురాః హేలయో హేలయ ఇతి కుర్వంతః పరాబభూవుః" అసురులు 'హేలయః హేలయః అని ప్రయోగించుటచే పరాభూతులైరి అని వేదమున ప్రయోగముననే అధర్మము వచ్చునని తెలియుచున్నది. కావున శబ్ద జ్ఞాన మాత్రముచే ధర్మము ప్రాప్తించును అనుట వేద విరుద్ధము.

మూ. అస్తు తర్హి ప్రయోగే.

అ. సరే అట్లైన ప్రయోగించుట చేతనే ధర్మము కల్గునని యంగీకరింతము.

మూ. ప్రయోగే సర్వలోకస్య

యది ప్రయోగే ధర్మః, సర్వోలోకోఽభ్యుదయేన యుజ్యేత.

అ. ప్రయోగ మాత్రముచే ధర్మము జనించుననిన లోకమున నందఱును సాధుశబ్దములను ప్రయోగించు చుందురు కనుక అందఱును అభ్యుదయము నందువారేయగుదురు.

మూ. కశ్చేదానీం భవతోమత్సరో, యది సర్వోలోకోఽభ్యుదయేన యుజ్యేత ?

అ. ఏమి ? లోకమంతయు నభ్యుదయ వంతమైన నీ కేమి మాత్సర్యమా ?

మూ. నఖలు కశ్చిన్మత్సరః ప్రయత్నానర్థక్యంతు భవతి. ఫలవతాచ నామ ప్రయత్నేన భవితవ్యమ్ నచ ప్రయత్నః ఫలా ద్వ్యతిరేచ్యః.

అ. నాకసూయ యేమియులేదు. శాస్త్రాభ్యాసముచే సాధు శబ్దముల నెఱింగి ప్రయోగించిన వారి ప్రయత్న మనర్థకమగును. ప్రయత్నము ఫలవంతమై యుండవలెను. ప్రయత్నము లేని ఫలసిద్ధియు నుండరాదు.

వి. వ్యాకరణాధ్యయనమున నివి సాధుశబ్దములని యెఱింగి ప్రయోగించిన వానికిని, సాధుశబ్దము లివియని తెలియక కేవలము వ్యవహారాను సారముగ సాధుశబ్దములను ప్రయోగించిన వానికిని ఫలము సమానమే యయిన వ్యాకరణాధ్యయనమున జేసిన యత్నము నిష్ఫలమగును. ప్రయోగ మాత్రము చేతనే ధర్మము జనించుననిన అజ్ఞునకు విజ్ఞునకు ఫలము సమానమే యగును.

మూ. ననుచ యే కృతప్రయత్నా స్తే సాధీయః శబ్దాన్ ప్రయోక్ష్యంతే, త ఏవ సాధీయోఽభ్యుదయేన యోక్ష్యంతే

అ. ప్రయత్నమునకు ఫలముండదని యేల శంకించెదవు ?

ప్రియత్నముచే సాధుశబ్దముల నెఱింగిన వారు లెస్సగా సాధుశబ్దము లను వాడుదురు, అభ్యుదయమును అధికముగ నార్జింతురు గదా !

మూ. వ్యతిరేకోపి వైలక్ష్యతే. దృశ్యంతే కృత ప్రియత్నాశ్చ ప్రివీణాః, అకృత ప్రియత్నాశ్చ ప్రివీణాః తత్ర ఫలవ్యతిరేకోపి స్యాత్.

అ. వ్యతిరేకముగ కూడ లోకమున కానవగును. వ్యాకరణ మున పరిశ్రిమ చేసియు శబ్దములను ప్రియోగింపలేని వారును, ప్రియ త్నము చేయకయే బాగుగ సుశబ్దములను ప్రియోగించు వారును గలరు. ప్రియోగ మాత్రిము చేతనే ఫలసిద్ధియనిన నాఁడు పైస్థలములయందు ఫలము విపరీతమగుచున్నది.

మూ. ఏవం తర్హి-నాపి జ్ఞాన ఏవధర్మో నాపి ప్రియోగ ఏవ

అ. అట్లయిన- కేవల శబ్దజ్ఞానము చేతఁ గాని కేవల ప్రియోగము చేతఁ గాని ధర్మము జనింపదు.

మూ. కిం తర్హి ? మఱి యెట్లు ?

మూ. శాస్త్ర పూర్వకే ప్రియోగేఽభ్యుదయః తత్తుల్యం వేద శబ్దేన. శాస్త్రాభ్యాస పూర్వకముగ సాధుశబ్దములను ప్రియోగిం చుట చేతనే అభ్యుదయము. అది 'వేద' అను శృతివచనమునకు కూడ సరిపడును.

మూ. శాస్త్రపూర్వకం యః శబ్దాన్ ప్రియుంక్తే సోఽభ్యుద యేన యుజ్యతే తత్తుల్యం వేదశబ్దేన. వేదశబ్దా అప్యేవమభివదంతి; యోఽగ్నిష్టోమేన యజతే.య ఉచైనమే వంవేద" "యోఽగ్నిం" నాచికేతం చినుతే, య ఉచైన మేవం వేద"

అ. శాస్త్రజ్ఞాన పూర్వకముగ సాధుశబ్దము నెఱింగి ప్రయో గించిన వాఁడే అభ్యుదయమునందును. వేదశబ్దములు కూడ నట్లే చెప్పు చున్నవి. "యోఽగ్ని-ష్టోమేన యజతే య ఉచైనమేవం వేద"

యోఽగ్నింనాచికేతం చినుతేయఉచైనమేవం వేద'' ఎవఁడుఅగ్నిష్టోమ యాగ విధానమును వేదముచే నెఱింగి యాచరించునో, ఎవఁడు నాచికేతచయన విధానమును వేదముచే నెఱింగి నాచికేతాగ్ని చయనము నాచరించునో'' అని తెలిసికొని యనుష్ఠించుటయే ఫలసిద్ధిని కల్గించునని వేదమునఁ జెప్పినట్లే శబ్దములను సాధుశబ్దములని యెఱింగి ప్రయోగించిన నాఁడే అభ్యుదయము జనించునని యెఱుంగవలెను.

మూ. అపర ఆహ-తత్తుల్యం వేదశబ్దే నేతి. యథా వేదశబ్దాః నియమపూర్వక మధీతాః ఫలవంతో భవం త్యేవం యః శాస్త్రపూర్వకం శబ్దాన్ ప్రయుంక్తే సోఽభ్యుదయేన యుజ్యతే ఇతి.

అ. లేదా "తత్తుల్యం వేదశబ్దేన'' అను దాని కిట్లు మఱియొక యర్థమును జెప్పవచ్చును.

'వేదశబ్దములు నియమపూర్వకముగ నధ్యయనము చేసిననే ఫలసిద్ధిని జనింపఁజేయును. అట్లే యెవఁడు శాస్త్రముచే శబ్దముల నెఱింగి ప్రయోగించునో వాఁడే యభ్యుదయమునందఁ జాలును' అని.

మూ. అథవా పునరస్తు-జ్ఞాన ఏవ ధర్మ ఇతి.

అ. లేదా మొదట చెప్పినట్లు సాధుశబ్దములను సాధుశబ్దములుగా తెలియుట చేతనే ధర్మము జనించునని చెప్పుదము.

మూ. నను చోక్తమ్-"జ్ఞానే ధర్మ ఇతిచేత్తథా ధర్మ ఇతి''

అ. శబ్దజ్ఞానము మాత్రము చేతనే ధర్మము కలుగుననిన అపశబ్ద జ్ఞానముచే నధర్మమును సంభవించునని యాక్షేపమున్నది కదా

మూ. నైషదోషః శబ్దప్రమాణకావయం, యచ్ఛబ్ద ఆహ తదస్మాకం ప్రమాణమ్ శబ్దశ్చ శబ్దజ్ఞానే ధర్మమాహ, నాపశబ్దజ్ఞానేఽధర్మమ్. యచ్చపున రశిష్టాప్రతిషిద్ధమ్, నైవతద్దోషాయ భవతి నాభ్యుదయాయ తద్యథా హిక్కిత హసిత కండూయితాని నైవ దోషాయ భవంతి నాభ్యుదయాయ.

ఉ. ఆ యాక్షేపము దోషముకాదు. శబ్దమే మాకు ప్రమాణము. శబ్దము చెప్పి నదియే ప్రమాణము కాని, చెప్పని దాని నూహించుట సరికాదు. వేదము శబ్దజ్ఞానముచే ధర్మము కలుగునని చెప్పెనే కాని యపశబ్దజ్ఞానముచే నధర్మము కలుగునని చెప్పలేదు. వేదము విధింపని దానిని కాని, నిషేధింపని దానిని కాని యాచరించుటచే దోషము ప్రాప్తింపదు అభ్యుదయము జనింపదు. వేదములో చేయఁదగినవిగా కాని చేయఁదగనివిగా కాని చెప్పక విడిచిన ఎక్కిలింత నవ్వు, గోకికొనుట మున్నగునవి దోషాపాదకములును కానేరవు అభ్యుదయ జనకములును కానేరవు.

వి. వేదము "ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్ భవతి" అని శబ్దమును సాధువుగా నెఱింగి ప్రయోగించుటచేతనే ధర్మమని చెప్పెను. కేవల ప్రయోగముచే ధర్మము జనింపదు. కాని అపశబ్దముల నెఱుంగుట చేతనే యధర్మమని యెచటను జెప్పలేదు. "హేలయః హేలయః' అని ప్రయోగించి పరాభవము నందిరి. అని చెప్పుటచే అపశబ్దములను ప్రయోగించిననే యధర్మము కాని జ్ఞాన మాత్రమున నధర్మము జనింపదు.

శబ్దములను సాధుశబ్దములుగా నెఱుంగుట ధర్మమూలము. ప్రయోగము దానికి సాధనము మాత్రమే. వ్యాకరణము నెఱుంగనివాఁడు సుశబ్దములను ప్రయోగించినను జ్ఞానము లేక పోవుటచే ధర్మము జనింపదు.

మూ. అథవాఽభ్యుపాయ ఏవాపశబ్దజ్ఞానం శబ్దజ్ఞానే యోహ్యపశబ్దాన్ జానాతి శబ్దానప్యసౌజానాతి తదేవం 'జ్ఞానే ధర్మః ఇతి బ్రువతోఽర్థా దాపన్నం భవతి-"అపశబ్ద జ్ఞానపూర్వకే శబ్దజ్ఞానే ధర్మః" ఇతి

అ. లేదా పై దోషమునకు మరొక విధముగా సమాధానమును

చెప్పవచ్చును. శబ్దజ్ఞానమునకు అపశబ్దజ్ఞానము ఉపాయమే. శబ్దజ్ఞానము అపశబ్దజ్ఞానము లేనిదే సాధ్యపడదు. కావున శబ్దజ్ఞానమున జనించు ఫలమే కాని ప్రత్యేక ఫలము సాధనమగు నపశబ్దజ్ఞానమున కుండదు. అపశబ్దము లివియని యెఱిఁగిన వాఁడే శబ్దముల నెఱుంగఁగలఁడు. కావున 'శబ్దజ్ఞానమున ధర్మము' అను శాస్త్రమునకు "అపశబ్దజ్ఞాన పూర్వకముగ శబ్దజ్ఞానము నార్జించినవారే ధర్మమను''ని తాత్పర్యము చెప్పవలెను.

వి. శబ్దజ్ఞానము-అపశబ్దజ్ఞానము అను మాటల యర్థమును సరిగా గుర్తింపవలెను.

'శబ్దజ్ఞానము' అనఁగా ప్రకృతి ప్రత్యయ విభాగముతో సాధువులగు శబ్దముల నెఱుంగుట. 'అపశబ్దజ్ఞానము' ఇవి అపశబ్దములు-వ్యాకరణ దుష్టములు అని యెఱుంగుట. అపశబ్దములుగా అపశబ్దముల నెఱుంగుట శబ్దజ్ఞానమునకు దారితీయును కావున నది శబ్దజ్ఞానమునకు సహకారియై ధర్మమునే జనింపఁజేయును. కాని యధర్మమును జనింపఁజేయదు.

మూ. అథవా కూపఖానకవ దేతద్భవిష్యతి। తద్యథా కూపఖానకః కూపం ఖనన్యద్యపి మృదాపాంసుభిశ్చావకీర్ణో భవతి. సోఽప్సు సంజాతాసు తత ఏవ తం గుణ మాసాదయతి, యేన చ స దోషో నిర్హణ్యతే; భూయసా చాభ్యుదయేన యోగో భవతి। ఏవమిహాపి యద్యప్యపశబ్దజ్ఞానేఽధర్మః తథాపి యస్త్వసౌ శబ్దజ్ఞానే ధర్మః తేన చ స దోషో నిర్ఘా నిష్యతే భూయసా చాభ్యుదయేన యోగో భవిష్యతి।

అ. అపశబ్దజ్ఞానముచే నధర్మము జనించునని యంగీకరించి సమాధానము నిచ్చుచున్నాఁడు. బావి త్రవ్వు వానికి త్రవ్వుచున్నంత సేపు ధూళి, బురద యొంటినిండ పూసికొని పోవును. నీరు వెలువడిన తరువాత ఆ నీటిచేతనే తన శరీరము నంటిన మాలిన్యము నంతను నగలి

కాని పూర్వము కంటె నెక్కుడు స్వచ్ఛత నందును. అట్లే యిచటను శబ్దముల నెఱుంగవలెననెడి ప్రయత్నములో నపశబ్దములను కూడ నెఱుంగుటచే నధర్మము జనింప నిందు శబ్దజ్ఞానము కలుగఁగానే దానిచే జనించిన ధర్మము ఈ యధర్మమును పోఁగొట్టుటయో కాక ఎక్కువ యభ్యుదయమును గూడ జనింపఁజేయును.

మూ. యదప్యుచ్యతే- 'ఆచారేనియమః ఇతి। యాజ్ఞే కర్మణి సనియమః అన్యత్రానియమః। ఏవహిం శ్రూయతే-యర్వాణ స్తర్వాణోనామ ఋషయో బభూవుః ప్రత్యక్ష ధర్మాణః పరాపరజ్ఞాః విదితవేదితవ్యాఃఅధిగత యాథాతథ్యాః। తే తత్ర భవంతో యద్వా న స్త ద్వానః ఇతి ప్రయోక్తవ్యే యర్వాణ స్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే. యాజ్ఞే కర్మణి పునః నాపభాషంతే। తైః పునరసురైః యాజ్ఞే కర్మ ణ్యపభాషిమ్, తత స్తే పరాభూతాః।

అ. జ్ఞాన మాత్రముచే ధర్మము జనించుననిన ప్రయోగముననే ధర్మమని నియమించు శ్రుతికి విరుద్ధమని వెనుక యాక్షేపమును చెప్పితిమే-దానికి సమాధానమేమి ? సాధుశబ్ద ప్రయోగముననే ధర్మమను నియమము యజ్ఞ కర్మలయందే కాని మిగిలినస్థలముల శబ్దములనైనను ప్రయోగింప వచ్చును. అపశబ్దములనైనను ప్రయోగింప వచ్చును.

యర్వాణుఁడు, తర్వాణుఁడు అను నిద్దఱు ఋషులుండెడివారు. వారు సర్వజ్ఞులు, విద్యాఽవిద్యా విభాగము నెఱింగిన మహనీయులు, శ్రవణమనన నిదిధ్యాసనాది సంపన్నులు, బ్రహ్మసాక్షాత్కారము నందిన వారును. వారు "యద్వానః, తద్వానః" అని ప్రయోగించుటకు బదులు "యర్వాణః" తర్వాణః "అని ప్రయోగించు చుండిరి. అందుచే వారి కాపేరు కలిగెను. లోకవ్యవహారమున నట్టి యపశబ్దములను ప్రయోగించినను యజ్ఞకర్మలందు మాత్రము అపశబ్దముల నుపయోగింపరు. ఆ యసురులు యజ్ఞమునందు "హేఽలయః హేలయః" అని

ప్రయోగించుటచే పరాభూతులైరి. అందుచే యజ్ఞకర్మలలోను శబ్దములనే ప్రయోగింపవలెను. నిత్యవ్యవహారమున నేది ప్రయోగించినను ప్రత్యవాయము లేదు.

వ్యాకరణ పదార్థ నిరూపణము

మూ. అథ వ్యాకరణ మిత్యస్య శబ్దస్యకః పదార్థః ?

అ. "వ్యాకరణము" అను పదమున కర్థమేమి ?

మూ. సూత్రమ్।

అ. వ్యాకరణ మనఁగా సూత్రము.

మూ. "సూత్రే వ్యాకరణే షష్ఠ్యర్థోఽనుపపన్నః" సూత్రే వ్యాకరణే షష్ఠ్యర్థో నోపపద్యతే-'వ్యాకరణస్య సూత్రమ్' ఇతి। కింహి తదన్యత్సూత్రాద్ వ్యాకరణమ్, య స్యాదః సూత్రం స్యాత్.

అ. సూత్రము వ్యాకరణ మనినచో "వ్యాకరణము యొక్క సూత్రము" అనుట కుదురదు కదా! వ్యాకరణమే సూత్రము కావున సూత్రము కంటె వేఱుగా వ్యాకరణము లేదు. కావున వ్యాకరణమునకు సంబంధించిన సూత్రము అని వ్యాకరణమును వేఱుగను సూత్రమును వేఱుగను ఎట్లు చెప్ప వీలగును ?

మూ. "శబ్దాప్రతిపత్తిః" శబ్దానాం చాప్రతిపత్తిః ప్రాప్నోతి వ్యాకరణాచ్ఛబ్దాన్ ప్రతిపద్యామహే ఇతి. నహి సూత్రత ఏవ శబ్దాన్ ప్రతిపద్యంతే। కింతర్హి ? వ్యాఖ్యానతశ్చ.

అ. శబ్దజ్ఞానములను వ్యాకరణము వలన నెఱుఁగుటయు పొసగదు. "వ్యాకరణము వలన శబ్దముల నెఱుంగుచున్నాము" అనుట సంగతము కాదు. కేవల సూత్రములచేతనే శబ్దములు నెఱుంగఁజాలము. ఇంకేమి కావలెను? వ్యాఖ్యానము కూడ కావలెను.

మూ. ననుచ తదేవ సూత్రం విగృహీతం వ్యాఖ్యానం భవతి.

అ. ఆ సూత్రమే విడఁదీసి చెప్పిన వ్యాఖ్యానమగును కదా!

మూ. న కేవలాని చర్చా పదాని వ్యాఖ్యానమ్। వృద్ధిః ఆత్, ఐచ్ ఇతి। కింతర్హి ? ఉదాహరణం, ప్రత్యుదాహరణం, వాక్యాధ్యాహార ఇత్యేత త్సముదితం వ్యాఖ్యానంభవతి.

అ. సూత్రములోని పదములను వేఱుచేసి చూపుట మాత్రమే వ్యాఖ్యానము కాదు. 'వృద్ధిరాదైచ్' అను సూత్రమును "వృద్ధిః, ఆత్, ఐచ్' అని. ఇంక నేమియుండవలెను ? ఉదాహరణము, ప్రత్యుదాహరణము, అర్థమును సరిగా వివరించుట కవసరమైన పదములను అధ్యాహారము తెచ్చుకొనుట మొదలగున దంతయు కలిసినది వ్యాఖ్యాన మనఁబడును.

మూ. ఏవం తర్హి శబ్దః

అ. అటులైన సాధుశబ్దమే వ్యాకరణ మందము.

మూ. "శబ్దే ల్యుడర్థః" యది శబ్దో వ్యాకరణం ల్యుడర్థో నోప పద్యతే–వ్యాక్రియంతే శబ్దా అనేనేతి వ్యాకరణమ్. నహిశబ్దేన కించిత్ వ్యాక్రియతే. కేన తర్హి ? సూత్రేణ

అ. శబ్దమే వ్యాకరణ మనిన 'వ్యాకరణము' అను పదమున 'ల్యుట్' ప్రత్యయార్థము సరిపడదు. వ్యాకరణము అను పదమునకు "వ్యాక్రియంతే శబ్దా అనేన" అని వ్యుత్పత్తి. దీనిచే శబ్దములు వ్యాకరింపఁబడును–కావున వ్యాకరణ మనఁబడుచున్నది. శబ్దముచే నేదియు వ్యాకరింపఁబడదు గదా ! మఱి దేనిచే వ్యాకరింపఁబడును ? సూత్రముచే.

అ. వ్యాకరించుటలో సాధకతమ మగునది వ్యాకరణము. శబ్దము వ్యాకరింఁబడునది. అది యేలక్ష్యము. కాని శబ్దము దేనిని గూడ వ్యాకరింపదు. శబ్దములను వ్యాకరించుటలో సాధనము సూత్రమే కావున శబ్దము వ్యాకరణమనుట సరికాదు.

మూ. భవేచ తద్ధితః–భవేచ తద్ధితోనోప పద్యతే "వ్యాకరణే

భూయోయోగో వైయాకరణః ఇతి. నహిశబ్దే భూయోయోగః క్వ తర్హి ? సూత్రే॥

అ. సాధుశబ్దమే వ్యాకరణమగు భవార్థమున తద్ధిత ప్రత్యయ మసంగతమగును. "వ్యాకరణే భవః యోగః వైయాకరణః" సూత్రమందే యోగముండును శబ్దమందుండదు (మఱి దేని విషయ మునసుండును ? సూత్రము విషయమున) శబ్దమే వ్యాకరణమనిన "వైయాకరణ" శబ్దము సంగతము కాదు.

మూ. ప్రోక్తాదయశ్చ తద్ధితాః. ప్రోక్తాదయశ్చ తద్ధితా నోప పద్యంతే పాణినినా ప్రోక్తం పాణినీయమ్ ఆపిశలం, కాశకృత్స్న మితి నహి పాణిని నాశబ్దాః ప్రోక్తాః కింతర్హి ? సూత్రమ్.

అ. "ప్రోక్తము" అను నర్థమున తద్ధిత ప్రత్యయములను జేర్చిన రూపములును కుదురవు. పాణినిచే ప్రోక్తము (చెప్పఁబడినది) పాణినీయము ఆపిశలము, కాశకృత్స్నము మున్నగు తద్ధితాంత రూపములు శబ్దమే వ్యాకరణమనిన సరిపడవు. పాణినిచే చెప్పఁబడినవి శబ్దములు కావు కదా ! మఱేమి ? సూత్రము.

మూ. కిమర్థ మిద ముచ్యతే "భవే" "ప్రోక్తాదయశ్చ తద్ధితాః" ఇతి.న ప్రోక్తాదయశ్చ తద్ధితా ఇత్యేవ భవేఽపి తద్ధితశ్చోదితః స్యాత్.

అ. ప్రోక్తార్థమున తద్ధిత ప్రత్యయము చేర్చిన రూపములు (పాణినీయము మొ॥) కుదురవు అని చెప్పుట చేతనే భవార్థమున తద్ధిత ప్రత్యయము చేర్చిన రూపము (వైయాకరణము) కుదురదని కూడ తెలియుచుండఁగా వేఱ్వేఱుగ "భవేచతద్ధితః, ప్రోక్తాదయశ్చ తద్ధితాః అని రెండు దోషములుగ చెప్పుట యెందులకు ?

మూ. పురస్తా దిద మాచార్యేణ దృష్టమ్ "భవేచ తద్ధితః"ఇతి తత్పఠితమ్.తత ఉత్తరకాలమిదం దృష్టమ్ "ప్రోక్తాదయశ్చ తద్ధితాః

ఇతి; తదపి పఠితమ్. నచే దానీ మా చార్యాః సూత్రాణి కృత్వా నివర్తయంతి.

అ. ముందుగ ఆచార్యునకు శబ్దము వ్యాకరణమనిన 'వైయాకరణః' అను భవార్థకరూపము పొసగదని తోఁచెను. వెంటనే "భవేచ తద్ధితః" "భవార్థమున తద్ధిత ప్రత్యయము చేరిన రూపము కుదురదు" అని వార్తికమును బఠించెను. తరువాత ప్రోక్తార్థక తద్ధిత రూపము కూడ కుదురదని తోఁచెను. దానిని గూడ "ప్రోక్తాదయశ్చ తద్ధితాః ప్రోక్తార్థమున తద్ధిత ప్రత్యయముఁజేరిన రూపము కుదురదు" అని చెప్పెను. ఆచార్యుఁడు సూత్రములను రచించి మరల మరలింపఁడు.

మూ. అయం తావ దదోషః యదుచ్యతే "శబ్దేల్యుడర్థః ఇతి. నావశ్యం కరణాధికరణయో రేవ ల్యుడ్విధీయతే కింతర్హి? అన్యేష్వపి కారకేషు-"కృత్యల్యుటో బహుళమ్"ఇతి తద్యథా ప్రస్కందనం ప్రపతనం ఇతి.

అ. 'శబ్దము-వ్యాకరణము' అనిన "వ్యాకరణము" అనుల్యుం డంత రూపము కుదురదని వెనుకఁ జెప్పినది కూడ దోషము కాదు. కరణాధికరణార్థములందే ల్యుట్ ప్రత్యయము చేరునను నియమము లేదు. మఱి యెట్లు? ఇతర కారకములందును "ల్యుట్టు" చేరునని "కృత్యల్యుటో బహుళమ్" అను చోటి బహుళగ్రహణము తెలియఁ జేయుచున్నది. ప్రస్కందనం-ప్రపతనం అను రూపములలో నపాదానార్థమున ల్యుట్టు చేరినది గదా!

మూ. అథవా శబ్దైరపి శబ్దా వ్యాక్రియంతే తద్యథా గౌరిత్యుక్తే సర్వే సందేహా నివర్తంతే, నాశ్వో, నగర్దభ ఇతి.

అ. లేదా శబ్దముల చేతఁ గూడ శబ్దములు వ్యాకరింపఁబడును. కావున కరణార్థమునందే ల్యుట్టు చేరవచ్చును. "గోవు" అను శబ్దము నుచ్చరించినంతనే తద్భిన్నములగు "అశ్వము" "గర్దభము" మున్నగు శబ్ద

ములన్నియు నావస్తువును తెల్పుటకు సమర్థములు కావని నివర్తింపఁ బడును గదా !

వి: విపరీతములగు వానిని తొలఁగించి సదృశములగు వానిని గ్రహించుటయే వ్యాకరణము కావున నది శబ్దముచేతను గూడఁ జేయఁబడును గనుక "వ్యాకరణము" అను కరణార్థక రూపము శబ్దమునకును జెల్లును.

మూ. అయంతర్హి దోషః-"భవే" ప్రోక్తాదయశ్చ తద్ధితాః ఇతి.

అ. "వైయాకరణము" "పాణినీయము" మొదలగు భవార్థక ప్రోక్తార్థక తద్ధిత రూపములు గుదురవను దోషమట్లేయున్నది గదా !

మూ. ఏవం తర్హి లక్ష్యలక్షణే వ్యాకరణమ్. లక్ష్యంచ లక్షణం చైతత్సముదితం వ్యాకరణం భవతి. కింపునర్లక్ష్యమ్, కింవాలక్షణమ్ ? శబ్దోలక్ష్యః సూత్రం లక్షణమ్.

అ. అట్లయిన "లక్ష్య లక్షణములు వ్యాకరణము" లక్ష్యము, లక్షణము అను రెండును కలిసినదే వ్యాకరణము లక్ష్యమన నేమి ? లక్షణ మననేమి ? శబ్దము లక్ష్యము-సూత్రము లక్షణము.

మూ. ఏవ మప్యయం దోషః-సముదాయే వ్యాకరణ శబ్దః ప్రవృత్తః అవయవే నోపపద్యతే సూత్రాణి చాప్యధీయాన ఇష్యతే వైయాకరణ ఇతి.

అ. అయినను ఈ దోషమున్నదే వ్యాకరణము అను శబ్దము లక్ష్య లక్షణసముదాయమును దెలియఁజేయును. కాని లక్షణమును గాని లక్ష్యమును గాని తెలియఁజేయుటకు తగదు సూత్రములను చదివిన వానిని గూడ "వైయాకరణుడుఁ" అని వ్యవహరించుట గలదు. అది యసంగతమగును.

మూ. నైషదోషః సముదాయేషుహి శబ్దాః ప్రవృత్తాః అవయవేష్వపి వర్తంతే తద్యథా పూర్వే పంచాలాః ఉత్తరే పంచా

లాః, తైలం భుక్తం, ఘృతం భుక్తం, శుక్లో, నీలః, కపిలః, కృష్ణ ఇతి ఏవమయం సముదాయే వ్యాకరణ శబ్దః ప్రవృత్తః అవయవేష్వపి వర్తతే.

అ. ఇది దోషము కాదు. సముదాయమున ప్రయోగింపఁదలసిన శబ్దము నవయవమందును ప్రయోగించుట కలదు.

తూర్పు పాంచాలము, ఉత్తర పాంచాలము. (పాంచాల దేశమున కంతటికిని చెల్లు "పాంచాలము" అను శబ్దమొక భాగమున ప్రయోగింపఁబడినది.) తైలము తినఁబడెను-ఘృతము తినఁబడెను. (ఓషధులతోఁజేర్చి చేసినతైలమును, ఘృతమును ఏకదేశమగు తైలము-ఘృతము అని వ్యవహరించుచున్నారు.) శుక్లము, నీలము, కపిలము, కృష్ణము, మొ॥నవి. (పూర్తిగా నన్నియవయవములు తెల్లగా లేకపోయినను 'శుక్లము' అని వ్యవహరించుట గమనించునది.) అట్లే సముదాయమునే తెలియఁజేయునదైనను వ్యాకరణశబ్దము అవయవములందును ప్రయోగింపఁబడును.

మూ. అథవా పునరస్తు సూత్రమ్.

అ. లేదా సూత్రమే వ్యాకరణము అగుఁగాక.

మూ. నను-చోక్తం 'సూత్రే వ్యాకరణే షష్ఠ్యర్థోఽనుపపన్నః' ఇతి

అ. సూత్రము వ్యాకరణము అనిన 'వ్యాకరణముయొక్క సూత్రము' అనుచోట షష్ఠ్యర్థము అనుపపన్నము అని చెప్పఁబడినదిగదా!

మూ. నైషదోషః। వ్యపదేశివద్భావేన భవిష్యతి.

అ. ఇది దోషము కాదు. వ్యపదేశివద్భావముచే షష్ఠ్యర్థము పపన్నము కాఁగలదు.

వి. లోకమున 'రాహువుయొక్క శిరము' అని వ్యవహారము గలదు. శిరమే రాహువు. రాహువుయొక్క శిర మనుట యెట్లు ? అ

నేకావస్థలతోఁగూడిన శిరము రాహువు-ఏకావస్థగల శిరము శిరము-అని అర్థభేదము నాశ్రయించి రాహువుశిర మనుట సమర్థనీయము.

అట్లే యిచటకు శబ్దవ్యాకృతిలోకరణమగుట యనునవస్థతోఁ గూడినసూత్రము వ్యాకరణము. అనేకావస్థలతోఁగూడిన సూత్రము సూత్రము. అట్టిభేదములనాశ్రయించి వ్యుత్పత్త్యర్థము సంగతమగును.

మూ. యదప్యుచ్యతే "శబ్దాప్రతిపత్తిః" ఇతి. నహి సూత్రత ఏవశబ్దాన్ ప్రతిపద్యంతే కింతర్హి ? వ్యాఖ్యానతశ్చేతి పరిహృత మేతత్-తదేవసూత్రం విగృహీతం వ్యాఖ్యానం భవతీతి.

అ. వెనుకచెప్పఁబడినదికదా.

"సూత్రమే వ్యాకరణ మనిన శబ్దప్రతిపత్తి కలుగదు. కేవల సూత్రములచేత శబ్దము తెలియఁగఁబడవు. వ్యాఖ్యానముకూడ కావలె" నని. అది యచటనే పరిహరింపఁబడినది, 'ఆసూత్రమే విడతీయఁబడిన వ్యాఖ్యానమగును'అని-

మూ. ననుచోక్తమ్-న కేవలాని చర్చాపదాని వ్యాఖ్యానమ్-వృద్ధిః ఆత్ ఐచ్ ఇతి కిం తర్హి ? 'ఉదాహరణం ప్రత్యుదాహరణం వాక్యాధ్యాహార ఇత్యే తత్సముదితం వ్యాఖ్యానం భవతి' ఇతి.

అ. కేవలము విడతీసి చెప్పిన పదములే వ్యాఖ్యానముకాదు. వృద్ధిః-ఆత్-ఐచ్ అని. మఱేమికావలెను ? ఉదాహరణము, ప్రత్యుదాహరణము, వాక్యాధ్యాహారము అనునవన్నియు కలిసి వాఖ్యానము అగును. అని చెప్పఁబడినదిగదా !

మూ. అవిజానత ఏవం భవతి సూత్రత ఏవ హిశబ్దాన్ ప్రతిపద్యంతే. ఆతశ్చ సూత్రత ఏవ, యోహ్యుత్సూత్రం కథయే న్నాదో గృహ్యేత.

అ. మందబుద్ధియగువాని కిదంతయు నవసరము. కాని శబ్దములను సూత్రములవలననే యెఱుంగవీలగును. సూత్రముల నతిక్రమించి ఎవఁడేదేని చెప్పిన నది గ్రహింపఁ బడదుకదా! కావున సూత్రముచేతనే శబ్దములు గ్రహింపఁబడును.

వర్ణోపదేశ ప్రయోజనాధి కరణము.

మూ. అథ కిమర్థో వర్ణానా ముపదేశః.

అ. శబ్దానుశాసనమునకు మొదట వర్ణముల నుపదేశించుట యెందులకు ?

వి. లోకములో నక్షరములందఱకును దెలిసినవే. వానినుపదేశించుటచే నేశబ్దముల నను శాసించుటయు జరుగదు. కావున నీపాణినీయ వ్యాకరణమున ప్రారంభమున మాహేశ్వరసూత్రములుగ నక్షరసమామ్నాయము నుపదేశించుటకుఁ బ్రయోజనమేమి?

మూ. వృత్తి సమవాయార్థ ఉపదేశః. వృత్తి సమవాయార్థో వర్ణానాముపదేశః. కిమిదం వృత్తిసమవాయార్థ ఇతి ? వృత్తయే సమవాయః వృత్త్యర్థో వా సమవాయః వృత్తిసమ వాయః వృత్తి ప్రయోజనో వా సమవాయః వృత్తిసమవాయః. కాపున ర్వృత్తిః ? శాస్త్రప్రవృత్తిః అథకః సమవాయః ? వర్ణానా మానుపూర్వ్యేణ సంనివేశః. అథక ఉపదేశః? ఉచ్చారణమ్ కుతఏతత్ ? దిశి రుచ్చారణక్రియః. ఉచ్చార్యహి వర్ణా నాహ-ఉపదిష్టా ఇమే వర్ణా ఇతి.

అ. వృత్తిసమవాయముకొఱకు వర్ణము లుపదేశింపఁబడినవి. వృత్తిసమవాయమను సమాసమునకు విగ్రహ మేమి ? వృత్తయే సమ సమవాయః-వృత్తికొఱకు సమవాయము వృత్త్యర్థః సమవాయః-వృత్తియే అర్థముగాఁగల సమవాయము. వృత్తి ప్రయోజనోవా సమవాయః-వృత్తి ఫలముగాగల సమవాయము. అని మూఁడు విధములుగా విగ్రహమును చెప్పవచ్చును.

వృత్తియన నేమి? శాస్త్రములు (వ్యాకరణసూత్రములు) లక్ష్యములందు ప్రవర్తించుట.

సమవాయమన నేమి? వర్ణముల క్రమసన్నివేశము (వర్ణముల నొక వరుసలో నమర్చుట.)

ఉపదేశము అన నేమి? ఉచ్చరించుట. అది యెట్లు? 'దిశి' ధాతువున కుచ్చారణ మర్థము. వర్ణముల నుచ్చరించి 'ఈవర్ణము లుపదేశింపఁబడినవి.' అనుచున్నారుగదా!

వి. సూత్రముల నిర్మాణము వాని ప్రవృత్తి సులభముగా సాగుటకే వర్ణముల నీ పదునాలుగు సూత్రములలో నొక వరుసలో నమర్చినారు. ఆ యమరికలోనున్నవి కనుకనే అచ్, ఇక్, యణ్ మొదలగు ప్రత్యాహారములను నిర్మించుట సాధ్యమైనది. ఆప్రత్యాహారము లుండుటచేత 'య, వ, ర, ల' లకు 'ఇ, ఉ, ఋ, ఌ' అను వర్ణములు వచ్చును. అవియే సంప్రసారణసంజ్ఞ కలవి. అని యింత చెప్పుటకు బదులు 'ఇగ్యణ స్సంప్రసారణమ్' యణ్ లకు బదులు ఇక్కులు వచ్చును—అని చెప్పెను. అంతేకాదు ఏ వర్ణమునకుబదులు ఏ వర్ణము వచ్చును అనిన 'యథాసంఖ్య మనుదేశ స్సమానామ్' అను సూత్రము చొప్పున యథాసంఖ్యముగ వచ్చును అనును. ఇచట ఒక వరుసలో నక్షరముల యమరిక లేకున్నచో నీ 'యథాసంఖ్య'మను సూత్ర మెట్లు ప్రవర్తించును. కావున సులభముగ శాస్త్రప్రవృత్తిని సాధించుటకీ యమరికతో వర్ణము లుపదేశింపఁబడినవి.

మూ. అనుబంధకరణార్థశ్చ. అనుబంధకరణార్థశ్చ వర్ణానాముపదేశః. అనుబంధా నాసంక్ష్యామీతి. నహ్యనుపదిశ్య వర్ణా ననుబంధాఃశక్యా ఆసంక్తుమ్. స ఏష వర్ణానాముపదేశః వృత్తిసమవాయార్థశ్చానుబంధకరణార్థశ్చ వృత్తిసమవాయశ్చ అనుబంధ కరణంచ ప్రత్యాహారార్థమ్ ప్రత్యాహారోవృత్త్యర్థః.

అ. సంజ్ఞగల వర్ణముల నా యా సముదాయముల చివరను చేర్చుటకును వర్ణము లుపదేశింపఁబడినవి. అనుబంధవర్ణములు (ఇత్సంజ్ఞికవర్ణములగు ణ్, క్, ఙ్ మొ॥) చేర్చుట వర్ణోపదేశము చేయనిదే వాక్యము కాదుకదా ? కావున సులభముగ శాస్త్రములు (సూత్రాదులు) ప్రవర్తించునట్లుచేయు క్రమసన్నివేశముకొఱకును, అనుబంధవర్ణములను జేర్చుటకును వర్ణము లుపదేశింపఁబడినవి. ఇట్లు ఒక క్రమమున నక్షరముల నమర్చుటయు, అనుబంధవర్ణములను జేర్చుటయు ప్రత్యాహారములను సాధించుటకొఱకు (అణ్, ఇక్ మొ॥ ప్రత్యాహారములకొఱకు) ఈ ప్రత్యాహారములు సులభముగ శాస్త్ర ప్రవృత్తి జరుగుటకు అని యెఱుంగవలెను.

మూ. ఇష్టబుద్ధ్యర్థశ్చ. ఇష్టబుద్ధ్యర్థశ్చ వర్ణానా ముపదేశః— 'ఇష్టాన్ వర్ణాన్ భోత్స్యామహే' ఇతి నహ్యనుపదిశ్య వర్ణా నిష్టా వర్ణా శక్యా విజ్ఞాతుమ్.

అ. ప్రయోగించుట కిష్టములైన వర్ణము లివియని బోధించుటకును వర్ణము లుపదేశింపఁబడినవి.' ప్రయోగించుటకు తగిన వర్ణములను బోధింపఁజేయుదుముగాక'యని వర్ణముల నుపదేశించినారు. వర్ణముల నుచ్చరించి చెప్పినఁగాని "యీవర్ణములే ప్రయోగయోగ్యములు" అని యెఱుంగుట శక్యముకాదుగదా !

మూ. ఇష్టబుద్ధ్యర్థశ్చేతిచే దుదాత్తానుదాత్త స్వరితానునాసిక దీర్ఘ ప్లుతానాముప్యుపదేశః. ఇష్టబుద్ధ్యర్థశ్చేతిచే దుదాత్తానుదాత్త స్వరితాను నాసిక దీర్ఘ ప్లుతానా ముప్యుపదేశః కర్తవ్యః. ఏవం గుణా అపిహివర్ణా ఇష్యంతే.

అ. ప్రయోగించుట కిష్టములైన వర్ణములను బోధించుటకు అక్షరసమామ్నాయము నుపదేశించిన, ఉదాత్తానుదాత్త స్వరిత భేదములతోను, అనునాసిక, దీర్ఘ ప్లుతాది భేదములతోనుగూడ

వర్ణములనన్నింటిని ఉపదేశింపవలెను. ఆ యా విధములగు వర్ణము లన్నియు నిష్టములగునవియేకదా !

వి. పదునాలుగు సూత్రములలో వర్ణము లుపదేశించుటకు ప్రయోగింపఁదగిన వర్ణము లివియని తెలుపుటగూడ నొక ప్రయోజనముగఁ జెప్పెను. కాని వర్ణసమామ్నాయమున హ్రస్వములను మాత్రమే యుచ్చరించెను. వానినిగూడ ఏకశ్రుతితో నుచ్చరించినాఁడే కాని ఉదాత్తాదిస్వరములతో నుచ్చరింపలేదు. అను నాసికములగు నచ్చుల నుపదేశింపలేదు. అవియన్నియు శాస్త్రమునం దావశ్యకములే కదా ! వానిని మాత్ర ముపదేశింపవలదా ?

మూ. ఆకృత్యుపదేశాత్సిద్ధమ్. అవర్ణాకృతి రుపదిష్టా సర్వ మవర్ణకులం గ్రహీష్యతి. తథేవర్ణాకృతిః తథోవర్ణాకృతిః.

అ. జాత్యుపదేశమువలన నాభేదము లన్నియు గ్రహింపఁబడును. 'అ' వర్ణమును జాతిప్రధానముగ నుచ్చరించిన నాజాతికిఁ జెందిన హ్రస్వ దీర్ఘప్లుతాదిభేదములతోడి సమస్త 'అ' వర్ణములు గ్రహింపఁబడును. అట్లే 'ఇ' వర్ణాకృతి (జాతి) 'ఇ' కార భేదముల నన్నింటిని గ్రహించును. అట్లే 'ఉ' వర్ణాకృతి 'ఉ' కార భేదముల నన్నిటిని గ్రహించును

మూ. ఆకృత్యుపదేశాత్సిద్ధ మితిచేత్ సంవృతాదీనాం ప్రతిషేధః. ఆకృత్యుపదేశాత్సిద్ధ మితిచేత్ సంవృతాదీనాం ప్రతిషేధో వక్తవ్యః. కేపునః సంవృతాదయః. సంవృతః, కలో, ధ్మాత, ఏణీకృతో,ఽమ్బూకృతో, ఽర్ధకో గ్రస్తో, నిరస్తః ప్రగీత, ఉపగీతః క్ష్విణ్ణో, రోమశ, ఇతి. అపర ఆహ గ్రస్తం నిరస్తమ వలంబితం నిర్హత మంబూకృతం ధ్మాతమథో వికంపితమ్। సందష్ట మేణీకృత-మర్ధకం ద్రుతం వికీర్ణ మేతాః స్వరదోష భావనాః ఇతి. అతోఽన్యే వ్యంజనదోషాః.

అ. జాత్యుపదేశము చేసిన నన్ని భేదములను గ్రహించును అనిన సంవృతాది దోషసహితములను గూడ గ్రహించును. కావున నిషేధమును జెప్పవలెను.

సంవృతాదులన నేవి ?

సంవృతము, కలము, ధ్మాతము, ఏణీకృతము, అంబూకృతము, అర్ధకము, గ్రస్తము, నిరస్తము, ప్రగీతము, ఉపగీతము, క్ష్విణ్ణము, రోమశము, అనునివి వర్ణోచ్చారణమున గలుగు దోషములు.

మరికొందఱు :-

గ్రస్తము, నిరస్తము, అవిలంబితము, నిర్హ్మాతము, అంబూకృతము, ధ్మాతము, వికంపితము, సందష్టము, ఏణీకృతము, అర్ధకము ద్రుతము, వికీర్ణము, అనునివి స్వరదోషములు, వ్యంజన దోషము లింతకంటె వేఱుగ నున్నవి. అని చెప్పుదురు.

వి. జాతి ప్రధానముగ నిర్దేశించిన నాఁడు అకారము ఆజాతికి చెందిన అకారముల నన్నింటిని గ్రహించును. కావున దోషసహితములగు వర్ణములను గూడ గ్రహించును. అట్లు గ్రహింపకుండుటకు నిషేధమును జెప్పవలెను. అని యాక్షేపమును దెల్పినాఁడు. సంవృతము అకారము మున్నగు వానిని వివృతముగ నుచ్చరింపవలసిన వానిని సంవృతముగ నుచ్చరించుట. కలము-ఒక స్థానములో నుచ్చరింపవలసిన యక్షరము నింకొక స్థానమున నుచ్చరించుట.

ధ్మాతము- శ్వాసాధిక్యముచే హ్రస్వముకూడ దీర్ఘమువలె వినఁబడుట ఏణీకృతము-స్వల్పభేదముగల వర్ణముల నా. భేదము గమనింపక పల్కుట. ఓకారౌకారములను భేదము తెలియకుండ సందేహము కల్గునట్లు పల్కుట. అంబూకృతము-స్పష్టముగా మాటాడినను లోలోన మాటాడి నట్లుండుట.

అర్ధకము-దీర్ఘమును హ్రస్వమువలె నుచ్చరించుట.

గ్రస్తము-జిహ్వామూలమున వర్ణములను నొక్కి పల్కుట.

నిరస్తము-తొందఱ తొందఱగా పల్కుట.

ప్రగీతము సామమువలె రాగముతో నుచ్చరించుట.

ఉపగీతము-ప్రక్కనున్న వర్ణముయొక్క గానముచే నాక్రమింపఁబడుట.

క్ష్విణ్ణము-వణకుచున్నట్లు పలుకుట.

రోమశము గంభీరముగా నుండుట.

అవలంబితము-ప్రక్క వర్ణములతో కలియక వేఱుగానున్నది.

నిర్హతము శ్రుతి కఠోరముగ నుండుట.

సందష్టము-పలుకవలసిన కాలముకంటె కాలము నధికము చేయుట.

వికీర్ణము ఒక్క యక్షరమైనను జల్లుకొనిపోయి పెక్కు అక్షరములవలె భాసించుట.

మూ. నైషదోషః॥ ఇది దోషముకాదు.

మూ. గర్గాది బిదాదిపాఠాత్సంవృతాదీనాం నివృత్తిః। గర్గాది బిదాది పాఠాత్సంవృతాదీనాం నివృత్తిర్భవిష్యతి।

అ. 'గర్గ' మొదలగు శబ్దములను 'బిద' మొదలగు శబ్దములను గర్గాదులలోను, బిదాదులలోను పాణిని పఠించుటచే ఆతఁడుచ్చరించినట్లు సంవృతాది దోషరహిత వర్ణములే శాస్త్రమున ప్రయోగయోగ్యములని గ్రహింప వీలగును. కావున సంవృతాది దోష నివృత్తి గర్గాది పాఠమువలననే సిద్ధించును.

మూ. అస్త్వన్యత్ గర్గాది బిదాది పాఠే ప్రయోజనమ్। కిమ్? సముదాయానాం సాధుత్వం యథాస్యాదితి।

అ. గర్గాది బిదాది గణములను పఠించుటకు వేఱొకటి గదా ప్రయోజనము. ఏమది? 'గర్గ' మొదలగు సముదాయములకు సాధుత్వ

ము ననుశాసించుట.

వి. 'గర్గాదులు' మొ॥గు గణములను పఠించుటలోని యుద్దేశ్యము గర్గ మొ॥ శబ్దములలోని వర్ణముల యుచ్చారణమున నెట్టి దోషము లుండరాదో యవి యేర్పఱించుట కాదు. గర్గ మొ॥ ప్రకృతులకు సాధుత్వము ననుశాసించి వానిపై ప్రత్యయములను జేర్చుటకు పఠించెను. 'గర్గ' అను ప్రకృతిపైననే ప్రత్యయముచు జేర్పవలెనే కాని "గార్గ్య" మున్నగు వానిపైఁ గాదని నిరూపించును.

మూ. ఏవంతర్హి అష్టాదశధాభిన్నాం నివృత్తకలాదికా మవర్ణస్య ప్రత్యా పత్తిం వక్ష్యామి।

అ. అట్లైనచో శాస్త్రముననే "అ" కారమునకు బదులు ఉదాత్తాదిభేదములచే 18 విధములైన, కలాది దోషరహితమైన 'అ' కారము వచ్చునని చెప్పెదము.

వి. అకారము ఆజాతికిఁ జెందిన 'అ' కారముల నన్నింటిని గ్రహించుననిన కలాది దోషములతోఁ గూడిన "అ" కారములను గూడ గ్రహింప వచ్చును. కావున వానిని గ్రహింపదని నిషేధమును చెప్పవలెను. లేదా పాణిని గణపాఠములో నుచ్చరించిన శబ్దములలోని వర్ణములను జూచి యిట్టి దోషరహితములే గ్రహింపఁదగినవి అని నిర్ధరింపవలెను. అదియును సాధ్యపడనిచో "అఅ" సూత్రమువలె ప్రతి వర్ణమునకును "ఇఇ" "ఉఉ" అను సూత్రములను రచింపవలెను. కలాది దోషరహితమును అష్టాదశ భేదసహితమును అగు "అ" కారము అకారమునకు బదులు వాడవలెను- అని విధించును. అట్లే అన్ని యక్షరములకును జెప్పిన దోషరహితములే గ్రహింపఁబడును.

పాణిని సూత్రములలో "అఅ" అని ఒక సూత్రము కలదు. హ్రస్వ అకారము శాస్త్రమున ప్రయోగించునంత వఱకును "వివృత"

ముగా పలుకవలెను. వ్యవహారమున 'సంవృతము' గా పలుకవలెను. అందులకు పాణిని అష్టాధ్యాయి చివర "అఅ" వివృత అకారము సంవృతముగా నగును. అని చెప్పెను. అట్లే అన్ని యక్షరములను గూర్చియు చెప్పిన నీ దోష సహితమ్ములు గ్రహింపఁబడు నవకాశముండదు గదా!

మూ. ప్రత్యాపత్తి ర్వక్తవ్యా.

అ. అట్లు వర్ణములకన్నింటికి మరల వర్ణ ప్రత్యాపత్తిని జెప్పవలెను గదా!

వి. ఇపుడు పాణిని సూత్రములలో లేని దానిని కల్పించుటచే శాస్త్రమును పెంచుట యగునని భావము.

మూ. లింగార్థాతు ప్రత్యాపత్తిః। లింగార్థాసా తర్హి భవతి!

అ. కొన్ని కార్యములను సాధించుటకు లింగములనుగా ఈ కలాది దోషముల నుపయోగించి శాస్త్రము చివర వానికి నివృత్తి చెప్పుట కీప్రత్యాపత్తి చేయబఁడును.

మూ. తత్తర్హి వక్తవ్యమ్।

అ. అట్లు కలాది దోషములతో శాస్త్రమున నుచ్చరించుట, వాని కేవో ప్రయోజనములను గల్పించుట, వానికి శాస్త్రము చివర మరల ప్రత్యాపత్తి (ఆ వర్ణమే దోషరహితమగునది వచ్చునని చెప్పుట) మొదలగు నదంతయు క్రొత్తగా చెప్పవలెను గదా!

మూ. యద్యప్యేత దుచ్యతే। అథవై తర్హి అనేక మనుబంధ శతం నోచ్చార్య మిత్సంజ్ఞాచ నవక్తవ్యా, లోపశ్చనవక్తవ్యః యదనుబంధైః క్రియతే తత్కలాదిభిః కరిష్యతే।

అ. కలాది దోషములతో వర్ణముల నుచ్చరించుట, వాని కేవో ప్రయోజనములు కల్పించుట యనునదంతయు క్రొత్తగా చెప్పవలసి

నదే. కాని దాని చేత కొన్నివందల అనుబంధ వర్ణముల నుచ్చరింప నవసరముండదు. వానికి లోపమును చెప్పనవసరము లేదు. ఏ ప్రయోజనము ఇంతకుముం దీయనుబంధములచే సాధింపఁబడు చున్నదో అది యిఁక నీ కలాది దోషములచే సాధింపఁబడును.

మూ. సిద్ధ్యత్యేవమ్। అపాణినీయంతు భవతి।

అ. అంతయు నీ విధముగ కుదురును. కాని యిదంతయు అపాణినీయము.

వి. అక్షర సమామ్నాయమున జాతి నిర్దేశము చేసినపుడు కలాది దోషసహితములగు వర్ణములను గ్రహింపకుండుటకు అష్టాధ్యాయి చివర 'అఅ' అను సూత్రమువలె 'ఇఇ' 'ఉఉ' అని ప్రతి వర్ణము సూత్రములచే దోషరహిత వర్ణములే వ్యవహార యోగ్యములని విధింపవలెనని చెప్పెను.

అట్లు చెప్పుట శాస్త్ర గౌరవము కాదా? అందులకు ఒక యుపాయమును చెప్పి మరల దానిని ఖండించును. ఏప్రయోజనము నపేక్షింపకయే వర్ణములను కలాది దోషసహితముగ నుచ్చరించుట పొసగదు. కావున వానికొక ప్రయోజనమును కల్పింపవలెను. అట్లు ప్రయోజనాపేక్షచే శాస్త్రమున నుచ్చరించినదానికి శాస్త్రాంతమున నివృత్తి చెప్పనగును. కావున ధాత్వాగమాదేశాదులను కలాదిదోషములతో నుచ్చరించి 'కలతో నుచ్చరించిన ఆగమము మొదట చేరును' 'కలతో నచ్చరించిన ధాతువు ఆత్మనే పదమగును' మొదలగు విధమున నాకలాదుల కేవో శాస్త్రీయములగు ప్రయోజనములను గల్పించి శాస్త్రముచివర దోషరహితములగు వర్ణములను వాని స్థానమున విధించిననాఁడు దోషరహిత 'అకార, ఇకార, ఉకారాదులే గ్రహింపఁదగినవని తెలియును. అంతేకాక పైప్రయోజనములను సాధించుటకుఁ గల్పించిన అనేకములగు ఇత్సంజ్ఞక వర్ణములను కల్పించుకొ

నట వానికి లోపమును చెప్పుటయు నవసరముండదు. ఆ ఇత్సంజ్ఞక వర్ణములుచేయు పనినంత నీకలాదులే నెరవేర్చును. కలాదిదోషసహిత వర్ణములు గ్రహింపరానివని శాస్త్రమే నిషేధించినట్లును అగును. అని కలాదిదోష దుష్టములగు వర్ణములను నిరాకరించుట కుపాయమును చెప్పి-ఇదియంతయు అపాణినీయమగును. వర్ణసమామ్నాయము లోక లాదిదోష దుష్టములగు వర్ణములు గ్రహింపఁబడకుండ నిషేధించుటకు శాస్త్రమునంతను మార్చి నూతన వ్యాఖ్యాపేక్షమగు అపాణినీయ మతమును కల్పించుట అసంమజసము. అని ఖండించెను.

మూ. యథాన్యాసమేవాస్తు

అ. ఉన్నదున్నట్లే యుండుఁగాక

మూ. నను చోక్తమ్-ఆకృత్యుపదేశాత్సిద్ధమితిచే త్సంవృతాదీనాం ప్రతిషేధః ఇతి.

అ. అక్షర సమామ్నాయమున జాత్యుపదేశముచేసిన సంవృతాది దోషసహిత వర్ణములు గ్రహింపఁబడకుండుటకు నిషేధముచేయ వలెను. అని చెప్పఁబడినదికదా.

మూ. పరిహృతమేతత్-గర్గాదిబిదాదిపాఠాత్ సంవృతాదీనాం నివృత్తిర్భవిష్యతి-ఇతి.

అ. ఆయాక్షేపము పరిహరింపఁబడినది.

గర్గాది బిదాది పాఠములవల సంవృతాదిదోషదుష్టవర్ణముల నివృత్తియగును.

మూ. ననుచాన్యద్ గర్గాదిబిదాది పాఠే ప్రయోజనముక్తమ్. కిమ్ ? సముదాయానాంసాధుత్వం యథాస్యాదితి॥

అ. గర్గాది బిదాది పాఠమునకు ప్రయోజనము వేఱొకటిగదా! అదియేమి? 'గర్గ' మొదలగు శబ్దముల సముదాయ సాధుత్వము ననుశాసించుటయే ఈగర్గాదిపాఠ, ప్రయోజనము అని చెప్పబడెనుగదా!

మూ॥ ఏవంతర్హి ఉభయమనేన క్రియతే - పాఠశ్చైవ విశేష్యతే, కలాదయశ్చ నివర్త్యంతే। కథం పునరేకేనయత్నేనోభయం లభ్యమ్? లభ్య మిత్యాహ। కథమ్? ద్విగతా అపి హేతవో భవంతి। తద్యథా-ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ ప్రీణితాః ఇతి। తథా వాక్యాన్యపి ద్విష్ఠాని భవంతి- శ్వేతో ధావతి, అలంబుసానాం యాతేతి॥

అ. అటులైన రెండుప్రయోజనములును దీనిచేతనే సాధింపఁబడును. గర్గాదిపాఠము, 'గర్గ' మొ॥గు శబ్దస్వరూపముల సాధుత్వమును నిరూపించును- గర్గమొ॥వానిలోని ఆకారాదులవలెనే యంతటను ప్రయోగింపవలెనని చూపి కలాదిదోషములను నివర్తింపఁజేయును.

ఒకప్రయత్నముచే రెండుప్రయోజనములెట్లు సాధింపవీలగును? సాధింపవచ్చును. అది యెట్లు? లోకములో రెండు ప్రయోజనములను సంపాదించు హేతువులు గలవు. మామిడిచెట్టు మొదట పితృతర్పణము చేసిననాఁడు మామిడి చెట్లును తడిసినవి. పితృదేవతలును తృప్తినందిరి అనవచ్చును. అట్లే వాక్యములుకూడ రెండర్థములు కల్గియుండును. శ్వేతోధావతి-అను వాక్యముచే శ్వా+ఇతః+ధావతి. కుక్క- ఇటుపరుగెత్తుచున్నది. శ్వేతః ధావతి. తెల్లనివాఁడు పరుగెత్తుచున్నాఁడు. అని రెండర్థములు వచ్చుచున్నవి. అలంబుసానాంయాతా అనువాక్యము. అలంబుసదేశములకు పోవువాఁడు-బుసలను పొందువాఁడు సమర్థుఁడు- అను రెండర్థములనిచ్చును.

మూ. అథవా తావదయంప్రష్టవ్యః - క్వేమేసంవృతాదయః శ్రూయేరన్నితి?

అ. లేదా ఒకప్రశ్న అడుగవలెను. ఈ సంవృతాదిదోషములు వేని నుచ్చరించునపుడు వినఁబడును? అని.

మూ. ఆగమేషు

అ. ఆగమముల నుచ్చరించునపుడు. ఆగమాః శుద్ధాః పఠ్యంతే.
ఆగమములు సంవృతాదిదోషరహితములుగనే పఠింపఁబడును.
వికారేషు తర్హి । అయిన యాదేశములయందు-
వికారా అపి శుద్ధాః పఠ్యంతే।
ఆ యాదేశములును శుద్ధములుగనే పఠింపఁబడును.
ప్రత్యయేషు తర్హి। అయిన ప్రత్యయములయందు।
ప్రత్యయా అపి శుద్ధాః పఠ్యంతే.
ప్రత్యయములును పరిశుద్ధములుగనే యుచ్చరింపఁబడును.
ధాతుషు తర్హి। అయిన ధాతువులయందు-
ధాతవోఽపి శుద్ధాః పఠ్యంతే।
ధాతువులును దోషరహితములుగనే పఠింపఁబడును.
ప్రాతిపదికేషు తర్హి। అయిన ప్రాతిపదికములయందు
ప్రాతిపదికాన్యపి శుద్ధాని పఠ్యంతే ।
ప్రాతిపదికములును శుద్ధములుగనే పఠింపఁబడును.
యానితర్హ్యగ్రహణాని ప్రాతిపదికాని॥

శాస్త్రమున సాధింపఁబడక లేదా ప్రక్రియాసాధనమున గ్రహింపఁబడక విడిచిన ప్రాతిపదికములలో దోషసహితముగ వర్ణము లుచ్చరింపఁబడ వచ్చునేమో.

మూ॥ ఏతేషామపి స్వరవర్ణానుపూర్వీ జ్ఞానార్థముపదేశః కర్తవ్యః శశః షష ఇతి మా భూత్. పలాశః పలాష ఇతి మా భూత్. మంచకో మంజక ఇతి మా భూత్

అ. అట్టి ప్రాతిపదికలకుఁగూడ స్వరక్రమము, వర్ణక్రమము తెలియుటకు ఆచార్యులు కంఠతః అనువాదరూపమగు నుపదేశము (ఉచ్చారణము) చేయవలెను. శశము-షషముగాను, పలాశము,

'పలాషము' గను, మంచకము - మంజకముగను ఉచ్చరింపఁ బడ కుండుటకు వానినిగూడ ఉచ్చరించిచెప్పుట యవసరము.

మూ ఆగమాశ్చ వికారాశ్చ ప్రత్యయాః సహధాతుభిః
ఉచ్చార్యంతే తతస్తేషు నేమే ప్రాప్తాః కలాదయః॥

అ. ఆగమములు, ఆదేశములు, ప్రత్యయములు, ధాతువులు మొ॥నవన్నియు స్పష్టముగా నిర్దుష్టముగా శాస్త్రమున నుచ్చరింపఁ బడినవి. కావున నీకలాది దోషములు వినఁబడుట కవకాశమే లేదు.

వి. కేవల వర్ణములు ప్రయోగార్హములు కావు. ఇక నీధాత్వా గమాదులు శుద్ధములు ఉపదేశింప బడుచున్నవి

కావున కలాది దోషదుష్టముగ నుచ్చరించు నవకాశమే శాస్త్రమున రాదు. కనుక వానిని 'అ'కారాదులు గ్రహింపకుండ నిషేధముచేయ నవసరము లేదు

ఇతి శ్రీమద్భగవత్పతంజలి విరచితే
మహాభాష్యే ప్రథమాధ్యాయస్య ప్రథమపాదే
ప్రథమ మాహ్నికమ్.

# వ్య క్తి వి వే క ము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

ఇచట 'శివుని' (శూలినమ్) పరామర్శించుటకు, మొదట ('అస్మై' అనుచోట) 'ఇదమ్' శబ్ద ముపయుక్తమైనది. రెండవపర్యాయము (తస్మై-అనునపుడు) తచ్ఛబ్ద ముపయుక్తమైనది. వీనిలో నిదం శబ్దము, సమీపముననున్న వ్యక్తిని పరామర్శించును. తచ్ఛబ్దము దూరముననున్న వానిని పరామర్శించును. కావున యజ్ఞదత్త దేవదత్తుల నువ్యక్తుల కెంతభేదముకలదో, యంతభేద మీ యిదమ్ తచ్ఛబ్దముల కున్నది. శివుఁడను నొకవ్యక్తిని పరామర్శించునపుడే, విభిన్నార్థకములగు శబ్దముల నిట్లుపయోగించుట మంచిదిగాదు. మొదట 'ఇదమ్' శబ్దముండుటచే రెండవపర్యాయము గూడ నిదమ్ శబ్దమునే యుపయోగించుట మంచిది. అపుడు సర్వనామప్రక్రమ భేదమను దోష ముండెడిదిగాదు. ప్రస్తుత మట్లు ప్రయుక్తము కాకుండుటచే నిందు సర్వనామప్రక్రమభేదదోష మున్నదని చెప్పవలసివచ్చినది.

ప్రశ్న:-అగుచో, యచ్ఛబ్దముతో నుపక్రమించి, తచ్ఛబ్దముతోగాని యిదమేతదదశ్శబ్దములతోఁగాని యుపసంహరించుచు నొకే విషయమును పరామర్శించినపుడుగూడ నీదోషముండునా ?

సమాధానము :-ఉండదు. యచ్ఛబ్ద తచ్ఛబ్దములకు సహజముగ పరస్పరము నిత్యసాపేక్షారూపమగు సంబంధ మున్నది. అందుచేఁ గేవల యచ్ఛబ్దముగాని,యిదమాది సహితమగు యచ్ఛబ్దముగాని, తచ్ఛబ్దము నవశ్య మపేక్షించును. అందుచే రెండవపర్యాయము కేవలమిదమేతదదశ్శబ్దములతో పరామృష్టమైనపుడును, పూర్వముపక్రాన్తమైన యచ్ఛబ్దసామర్థ్యము ననుసరించి, తచ్ఛబ్దమవశ్య మపేక్షితమగుచుండుటచే నచట నీదోషమురాదు. కేవ౦ మిదమేతదదశ్శబ్దములతో

మాత్రమే యుపక్రాన్తమైనపుడు మాత్ర మాయర్థమును, రెండవ పర్యాయము తచ్ఛబ్దము పరామర్శింపదు. అపు డిద మేతదదశ్శబ్దము లతో నారంభమునందు పరామృష్టమైన యర్థమును రెండవపర్యాయము, క్రమముగ తిరిగి యిద మేతదదశ్శబ్దములతోనే పరామర్శింప వలయునుగాని, తచ్ఛబ్దముతోఁ బరామర్శింప వీలులేదు. అందుచే 'తే హిమాలయ' అనుపద్యమున సర్వనామప్రక్రమభేదదోషమున్న దని యంగీకరింపవలసిన దే !

ప్రత్యయ ప్రక్రమభేదదోషము

శ్లో. రుదతా కుత ఏవ సా పున ర్భవతా నానుమృతే రవాప్యతే
పరలోకజుషామ్ స్వకర్మభి ర్గతయో భిన్నపథా శ్శరీరిణామ్.

(రఘు. 8-85)

అర్థము :-రుదతా=ఏడ్చుచున్న, భవతా=నీచేత, సా=ఆ ఇన్దుమతి, కుతఏవ=ఎట్లు, లేక ఎచటనుండి,లభ్యతే=పొందఁబడును ? ఆమె బ్రతుకుట యసంభవమే యని భావము. అనుమృతేః (అపి)=ఆమె ననుసరించి మరణించుటవలనఁగూడ, న అవాప్యతే=పొందబఁడదు; పరలోకజుషామ్=పరలోకమును పొందిన, శరీరిణామ్=ప్రాణులయొక్క గతయః=గమ్యస్థానములు, స్వకర్మభిః=వారుచేసిన పుణ్యాపాపకర్మల చేత, భిన్నపథాః హి=భిన్నమైన మార్గములు గలవియగును గదా !

ఇచట 'రుదతా' యనునపుడు శతృప్రత్యయమున్నది. అనుమృతేః అనునపు డనుమృతి పదములో క్తిన్ ప్రత్యయమున్నది. లేదా 'రుదతా భవతాకుతః అవాప్యతే అనునపుడు, రోదనము కర్తృవిశేషణరూపమున ననవాప్తిలో హేతువైనది. అనుమృతియనునది సాక్షాత్తుగ హేతువైనది. ఈభేదముగూడ పై పదములలోని ప్రత్యయముల భేదము ననుసరించియే వచ్చినది.

'కుతఏవతు సానురోధనాత్' అనుపాఠము నవలంబించుచో నీ దోషము పోవును. ఇందు ప్రత్యయ స్వరూపభేదమున్నను ప్రత్యయార్థములలో భేదములేదు.

'రుష్టత్రా కుతఏవ సా పునర్భవతా నానునృతా ప్యవాప్యతే'

అని కొన్నిగ్రంథములలోనున్న పాఠమునఁగూడ నీదోషమ్ము

మఱియొక యుదాహరణము :-

శ్లో. యశోఽధిగన్తుంసుఖలిప్సయావా మనుష్యసంఖ్యామతివర్తితుంవా
నిరుత్సుకానా మభియోగభాజామ్ సముత్సుకే వాంక ముపైతిసిద్ధిః

అర్థము యశః=కీర్తిని అధిగన్తుం పొందుటకు, సుఖలిప్సయా వా=సుఖమును పొందవలెనను కోరికచేఁగాని, మనుష్యసంఖ్యా మతి వర్తితుంవా=అందఱికంటె నెక్కువకీర్తిని పొందుటకుఁగాని, నిరుత్సుకానామ్=కేవల ముత్కంఠను పొందక, అభియోగభాజాం=యత్న పరులైనవారికి, సిద్ధిః=కార్యసిద్ధి సముత్సుకా ఇవ=ఉత్కంఠకలదివలె అంకమ్=తొడను, ఉపైతి=స్వయముగనే వచ్చును. ఇచట అధిగన్తుమ్ అతివర్తితుమ్ అనునపుడు తుమున్ ప్రత్యయమును, లిప్సయా అను నపుడు సన్నంతపదముపై తృతీయా ప్రత్యయము నుండుటచే ప్రత్యయప్రక్రమభేదము వచ్చినది. వికల్పార్థమును తెల్పు వాశబ్దముగూడ నిచట నస్థానమునం దుపయుక్తమైనదను విషయమును ముందు తెల్పు దుము. 'యశోధిగన్తుం సుఖమీహితుంవా'అను పాదమిచట ప్రశస్తము

శ్లో. పృథ్వి ! స్థిరా భవ భుజంగమ ధారయైనామ్
త్వం కూర్మరాజ ! తదిదం ద్వితయం దధీథాః
దిక్కుంజరాః ! కురుత తత్త్రితయే దిధీర్షామ్
దేవః కరోతి హరకార్ముక మాతతజ్యమ్.

అర్థము :-పృథ్వి=ఓ భూమీ! స్థిరా భవ=కదలకుండుము ధైర్యమును వహింపుము. భుజంగమ=ఆదిశేషా! ఏనామ్=ఈభూమిని, ధారయ=ధరించుము; కూర్మరాజ=ఓ కూర్మమా! ఇదంతత్ ద్వితయ భూమి ఆదిశేషువు అను నిద్దఱను,దధీథాః=ధరింపుము. దిక్కుంజరాపి=ఓదిగ్గజములారా;త్రితయే=పైమూఁటివిషయమై దిధీర్షాం=ధరింపవలెనను సంకల్పమును, కురుత=చేయుఁడు; దేవః=శ్రీరాముఁడు, హరకార్ముకమ్=శివధనుస్సునుఆతతజ్యంకరోతి=ఎక్కుపెట్టుచున్నాఁడు పృథివి మొదలగువానికి సంబంధించిన యాజ్ఞలనిచ్చుట కవికి వివక్షితము 'స్థిరాభవ'యను నాజ్ఞతో నీపద్య ముపక్రాన్తమైనది. తుదివఱకును నాజ్ఞారూపమగు నర్థ మీపద్యమున కన్పడుచునే యున్నది భవ, దధీథాః కురుత యను క్రియలలోఁగల యాజ్ఞార్థక ప్రత్యయస్వరూపములలో భేదమున్నను, ప్రత్యయములన్నియు లోడర్థవాచకములే-కవి యనుజ్ఞార్థమునే (ప్రైషార్థమునే) ప్రధానముగఁజెప్పనెంచినాఁడు. ఆయాజ్ఞను తెలుపుపదముల కుద్దేశ్యప్రతినిర్దేశ్యభావము లేకుంటచే నాపదము లేకరూపమునలేవు; అయినను నిచట నది కవి వివక్షితము కాకుంటచే ప్రత్యయప్రక్రమదోష మున్నదని యిట్టితావులందు మనము చెప్పరాదు.

పర్యాయప్రక్రమభేదము

శ్లో. మహీభృతః పుత్రవతోఽపి దృష్టిః
తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్
అనన్త పుష్పస్య మధోర్హి చూతే
ద్విరేఫమాలా సవిశేషసంగా.

అర్థము :-పుత్రవతోఽపి=మైనాకుఁడను పుత్రుఁడున్నను మహీభృతః=హిమవంతునియొక్క దృష్టిః=దృష్టి తస్మిన్ అపత్యే=ఆపార్వతియందు తృప్తిమ్, న, జగామ=తృప్తిని పొందలేదు. ఆమెపైనున్న

పేరిమ కంతములేదని భావము. అనన్తపుష్పస్య=అనేక కుసుమములు గల మధోః=వసంతఋతువుయొక్క (వసంతకాలమునకు సంబంధించిన) ద్విరేఫమాలా=భ్రమరపంక్తి, చూతే=మామిడి పూవునందు, సవిశేషసంగాహి=అధికమైన యాసక్తి కలదగుచున్నది కదా !

కవి యిచట 'పుత్రవతః' అనునపుడు పుత్రశబ్దముతో నుపక్రమించినాఁడు తరువాత పుత్రార్థమును తెల్పుటకే అపత్యశబ్దము నుపయోగించినాఁడు. ఒకేయర్థమును తెలుపుటకు, రెండుభిన్నశబ్దములనుపయోగించుటచే నిచట పర్యాయప్రక్రమభేదము వచ్చినది. చూత, పుష్పశబ్దములుగూడ భిన్న పర్యాయములుగనే కన్పడినను, వానిలో నొకటి పుష్పసామాన్యమును రెండవది పుష్పవిశేషమును దెలుపును. అందుచే పర్యాయప్రక్రమదోషమచ్చటలేదు "మహీభృతోపత్యవతోపిదృష్టిః తస్మిన్నపత్యే నజగామ తృప్తిమ్" అని మార్చినచో బాగుండును.

ఇచట నీవిషయమును గమనింపవలయును. పుత్రశబ్దమపత్యవిశేష (సంతానవిశేష) వాచకము. అపత్యశబ్దము సంతానసామాన్యమును తెల్పుటచే నది సామాన్యవాచకమే యయినను తస్మిన్నపత్యే యని తచ్ఛబ్దముయొక్క సాహచర్యమువలన నదియును విశేషవాచకమగును. విశేషవాచకమైన యీరెండవ పదమును దృష్టిలోనుంచుకొనినపుడు మొదటి విశేషవాచకపదము సామాన్యవాచకమే యగును; కావున మొదటిపాదమునఁగూడ సామాన్య విశేషవాచకపదములున్నవని సమన్వయమును చేసికొనుచో నీదోషముండదు. అని కొందఱందురు. కాని యిది సరియైనవాదము కాని వ్యాఖ్యాతలభిప్రాయపడుచున్నారు. వీరి భావమిది.

ఈశ్లోకమునందలి రెండు వాక్యములకును బింబ ప్రతిబింబభావము వివక్షితము. మొదటివాక్యమున పుత్రశబ్దము సామాన్యవా

చకము దానితరువాత నున్నయపత్యశబ్దము సామాన్యవాచకము. రెండవవాక్యమున మొదట పుష్పమను సామాన్యవాచకపదము, తరువాత చూతమను విశేషవాచకపదమును నున్నవి. ఈవిధముగ రెండువాక్యములలో భేదము కన్పడుచున్నది. మొదటివాక్యమున, సర్వ నామ సంబంధమువలన రెండవ శబ్దము మఱియొక విశేషమునే తెల్పును. సామాన్యమును దెలుపదు. అపుడును పుత్రాపత్యశబ్దములు రెండును విశేషవాచకములేయైనవి. రెండవ విశేషపదము దృష్టిలో మొదటి విశేషపదము సామాన్యవాచకమగుననుటసత్యమైనను నదియు గతికగతికమగు ననుచితవాదము. అపుడును రెండవవాక్యమునఁగూడ రెండు విశేషవాచకము లుండవలయును. అట్లిచట లేదు. కావునమహీభృతోపత్యవతోపి యని మార్చుచో మొదటి యపత్యశబ్దముసామాన్యవాచకమై, రెండవ యపత్యశబ్దము సర్వనామ సంబంధమువలన విశేషవాచకమగును. అపుడు రెండువాక్యములకును బింబప్రతిబింబ భావరూపసాదృశ్యము బాగుగ గుదురును. తేలిన దిది. ప్రతివాక్యమునందును, సామాన్య విశేషవాచకములలో, విశేషవాచకములు మాత్రమోయుండిననే రెండు వాక్యములకును బింబప్రతిబింబభావము కుదురును. ప్రస్తుతము రెండవవాక్యములో సామాన్యవిశేషములు న్నవి. అందుచే మొదటివాక్యమునఁగూడ సామాన్యవిశేషములే యుండవలయును. కావున నిట్లు మార్చుటయే సమంజసమని పెద్దల యభిప్రాయము. ప్రారంభమున నేరూపమున శబ్దము లుపక్రాన్తములైనవో యారీతిని తరువాత నుండవలయుననిగదా సిద్ధాన్తము-పైని సూచనచేసిన సవరణ రెండవవాక్యమున సామాన్య విశేషములున్నవి కావున మొదటి వాక్యమునఁగూడ నట్లుండవలయుననినారు. అది యుక్తముకాదు మొదటివాక్యమున మొదట పుత్రశబ్దమున్నది. దానిననుసరించి దానితరువాత పుత్ర్యామ్ అని యుండవలయును.

అపుడు "మహీంభృతః పుత్రివతోఁపి దృష్టిః తస్యాం హిపుత్ర్యాం నజ గామ తృప్తిమ్" అని యుండవలయునని కొందఱందురు. కాని యిది యు నుచితముగాదు. కేవలము శబ్దములకుఁగల పౌర్వాపర్యమును మాత్రమే చూడఁగూడదు. ఔచిత్యమును ప్రధానముగఁ జూడవల యును ఈసవరణను జేసినచో మొదటివాక్యమున రెండు శబ్దములును విశేషవాచకములే యగును. రెండవ వాక్యమున సామాన్యవిశేషము లగును. కావున దృష్టాన్తము సరిగా కుదురదు. మఱియొక యభిప్రా యముగూడఁ గలదు. లోకములోఁ దల్లిదండ్రులు పుత్రునికంటె పుత్రిక నధికముగఁ బ్రేమింతురు ప్రస్తుతముకూడ హిమవంతుఁడు మైనాకునికంటె పార్వతి నధికముగ ప్రేమించినాఁడు. దీనిననుసరించి దృష్టాన్తమునే మార్చవలయునని మధుసూదనీ వివృతికర్త లభిప్రాయ పడుచున్నారు. అపుడు "అనన్తచూతస్య మధోర్హి భృంగీ సామాన్య పుష్పే సవిశేషసంగా" అని రెండవవాక్యమును మార్చవలయును. కాని యిపుడు రెండవవాక్యములో విశేష సామాన్యములున్నవి. మొదటివాక్యమున సామాన్యవిశేషములు క్రమముగనున్నవి. కావున సాదృశ్యమిపుడును లభింపదు. ఇఁక, పౌర్వాపర్యవిచారణను చేయనక్క ఱలేదు. ఔచిత్యమును గ్రహించినఁ జాలు ననువాదము నాశ్రయింప వలయును. రెండువాక్యములలోను, సామాన్యవిశేషములున్నఁజాలును వానిక్రమమును బాటింపనక్కఱలేదని తృప్తిపడుచో నీపై యర్థమే కవి వివక్షితమని మనము నమ్మిచో నీసవరణ నంగీకరింపవచ్చును.

మఱియొక యుదాహరణము :-

శ్లో. 'ఉదన్వచ్ఛిన్నా భూః సచ నిధి రపాం యోజనశతమ్'

అర్థము:- భూః=భూమి ఉదన్వచ్ఛిన్నా=సముద్రినిచే పరిమిత ముగ జేయఁబడినది. సః అపాంనిధిశ్చ=సముద్రుఁడును యోజనశతమ్= నూఱు యోజనములున్నాఁడు.

ఇచట సముద్రమను నర్థమునందే మొదట ఉదన్వత్ పదము, తరువాత 'అపాంనిధిః' అనుపదమును నుపయోగించుటవలన నీదోషమువచ్చినది. అందుచే 'మిత్రాభూః పత్యాపాం సచపతి రపాం యోజన శతమ్) అనుపాఠము బాగుండును. 'ఉదన్వచ్ఛిన్నా' అనునపు డింకొక దోషముగూడ నున్నది. ఇచట సముద్రుఁడు విధేయమగుట ప్రధానుఁడు; కాని సమాసము చేయుటవలన నతనికి ప్రాధాన్య మస్తమించినది. కావున సమాసముచేయుటయు నొకదోషమే. సవరించిన పాఠమునందా దోషముకూడ పరిహృతమైనది.

వేఱొక యుదాహరణము.

శ్లో. వరం కృతధ్వస్తగుణా దత్యన్త మగుణః పుమాన్
ప్రకృత్యా హ్యమణిః శ్రేయాన్ నాలంకారశ్చ్యుతోపలః.

అర్థము- కృతధ్వస్తగుణాత్=పూర్వము మంచిగుణములనలవర్చుకొని, తరువాత వానిని విడనాడుకొనిన వానికంటె, అత్యన్తమ్ అగుణః, పుమాన్=మొదటినుండియును, గుణములులేని మనుష్యుఁడే, వరం=మంచివాఁడు. ప్రకృత్యా=సహజముగనే, అమణిః= మణిలేని, అలంకారః=అలంకారము, శ్రేయాన్=మంచిది-చ్యుతోపలః= జారిపోయినమణిగల, అలంకారః=అలంకారము నశ్రేయాన్=మంచిదిగాదు. మణియనునొకయర్థమును తెలుపుటకే, మణి,ఉపల, అను రెండుపర్యాయశబ్దము లుపయుక్తములగుటచే నిచటపర్యాయ ప్రక్రమభేద దోషముకల్గినది. ప్రకృత్యానుపలఃశ్రేయాన్' అనిగాని, 'నాలంకారోగలన్మణిః' అనిగాని సవరించుచో నీదోషము పరిహృతమగును.

ఇటులే

ఈసవరణను చేసినను చకారప్రయోగములోని దోషము పోలేదు. వీర్యం, చ, అనునపుడు వీర్యమ్ అనుపదమును ఆగసాచ యనునపుడు ఆగసాయను పదమును సమానవిభక్తిలో లేవు. వీర్యమ్న

సినవి హేతువు గూడఁ గాదు. కావున నిచట చకార ప్రయోగము దోషము. వీర్యాంచ విద్వత్సు-అను విశేషణ మిప్పుడు వ్యర్థమగును-ఈ దోషము తొలఁగుటకై "జ్ఞానేన వీర్యస్య సుతే మహానః" అని పాద మును సవరింపవలయునని వ్యాఖ్యాతలు సూచించుచున్నారు.

శ్లో॥ బభూవ భస్మైవ సితాంగ రాగః కపాలమే వామల శేఖర శ్రీః
ఉపాన్తభాగేషు చ రోచనాంకః సింహాజినస్యైవ దుకూలభావః"

అర్థము:-భస్మ+ఏవ=బూడిదయే,సితాంగరాగః=తెల్లని మైపూఁత, బభూవ=అయ్యెను. కపాలమేవ=పుఱ్ఱెయే, అమలశేఖరశ్రీః=స్వచ్ఛ మైన శిరోభూషణ శోభ, (అయినది) సింహాజినస్య=సింహపుతోలు యొక్క ఉపాన్త భాగేషు=అంచులయందు, రోచనాంకః=హంసాది చిహ్నము కలదియే, దుకూలభావః=వస్త్రముగుట, (అయ్యెను) భస్మ-సితాంగరాగః, కపాలమ్ అమలశేఖరశ్రీ :- అనునవన్నియు ప్రథమా విభక్తిలో నున్నవి- 'కాని సింహాజినస్య అనునది షష్ఠీ విభక్తిలో నున్నది. కావున విభక్తి ప్రక్రమభంగ దోషము వచ్చినది. దానిని వారించుటకై "మృగేంద్రచర్మైవ దుకూలమస్య" అని సవరింపవల యును.

ప్రస్తుతమునకు సంబంధించిన ప్రక్రమభంగ దోషమేకాదు. ఇంకఁ గొన్ని దోషము లిందున్నవి. రోచనాంకః దుకూలభావః అను ప్రయోగము సరియైనది కాదు.- గోరోచనపు గుర్తులు గలిగియుండుట యనునది యొక ద్రవ్యము యొక్క ధర్మము. దుకూలభావః అనఁగా వస్త్రధర్మము. గోరోచనాంకము వస్త్రమునకు గుణమో విశేషణమో యగునే కాని వస్త్రధర్మమునకుఁ గాదు. మృగేంద్ర చర్మైవ దుకూల మస్య యను పాఠనమున నీ దోషము కూడ పరిహృతమైనది. అపుడు దుకూలమను పదమునకు విశేషణముగా నుండవలయుఁ గాన, రోచనాంకః అను పదమును 'సురోచనాంకమ్' అని మార్చి 'ఉపాన్త

భాగేషు సురోచనాంకమ్ మృగేంద్రచర్మైవ దుకూలమస్య' అని మార్పవలయును.

ఉపసర్గప్రక్రమ భేదదోషము.

శ్లో॥ విపదోభిభవన్త్య విక్రమం, రహయత్యాపదుపేత మాయతిః
నియతా లఘుతా నిరాయతే, రగరీయా న్నపదం నృపశ్రియః-

అర్థము:- అవిక్రమమ్= పరాక్రమములేని వానిని, విపదః = ఆపదలు, అభిభవన్తి= ఎదుర్కొనుచున్నవి; ఆపదుపేతమ్= ఆపదలతోఁ గూడిన వానిని,ఆయతిః= భవిష్యత్తు, రాఁబోవుకాలమునందుఁ గలుగనున్న శుభము, రహయతి = వదలును; నిరాయతేః= మంచి భవిష్యత్తులేని వానికి, లఘుతా= తేలికదనము, నియతా= తప్పక కలుగును; అగరీయాన్ = తేలికయైనవాఁడు, నృపశ్రియః= రాజలక్ష్మికి పదమ్న= అర్హుఁడు గాఁడు.-

ఇచట 'విపదః' యనుపదమున 'వి' యను నుపసర్గమున్నది.- ఆపత్-అనుచోట "ఆ"యను నుపసర్గమున్నది.- ఉపసర్గలు భేదించినవి అందుచే దీనిని మార్చి-

'తదుపేతమ్ విజహాతి చాయతిః'. అని చదువవలయును 'వి+జహాతి' యనునపుడు వియను నుపసర్గ వచ్చినది.

[విపదః- అనునపుడు నామములో వియను నుపసర్గము. విజహాతి యనునపుడు క్రియాపదములో నుపసర్గమని యందురేని, యీ మార్పు ననుసరించి యాపత్తను పదమే యిట లేకుండుటచే, నామములోనుపసర్గ భేదమను దోషమే లేదు-అసలు విపదః యనునది కర్త. ఆపదుపేతమ్మనునపు డాపదమంతయును కర్తగాదు. ఈరీతి నాలోచించుచో నిట నుపసర్గ ప్రక్రమభంగ దోషమే లేదు] ఇంకను దోషములున్నవి.- విపదోభిభవన్త్య విక్రమమ్మను వాక్యములో కర్తయు క్రియయు బహువచనములో నున్నవి.-తరువాతి వాక్యములో నవి యేకవచనములో

నున్నవి - లేదా తరువాతి వాని ననుసరించి మొదటి వాక్యములోని కర్త క్రియల నేకవచనములోని కైనను మార్చవలయును.

'లఘుతా' యని యుపక్రాన్తమైనది. దాని నగరీయాన్ అని పరామర్శ చేయుటవలన పర్యాయ ప్రక్రమ దోషము కల్గినది.- అటులే మొదటి మూడు వాక్యముల రచనాక్రమమునకును, నాల్గవ వాక్య రచనమునకును భేదమున్నది. దీనినే శాబ్దప్రక్రమదోష మందురు. ఈ దోషములను తొలగింపవలయునను నుద్దేశ్యముతో కావ్యప్రకాశకర్త యీశ్లోకము నీ విధముగ సవరించినాడు.

"విపదోభి భవన్త్య విక్రమం, తదభిభవః కురుతే నిరాయతిమ్
లఘుతాం భజతే నిరాయతిః, లఘుతావాన్న పదం నృపశ్రియః.

ఈ మార్పు ననుసరించినను దోషనిరాశము జరుగలేదు. అభిభవన్తి యనినపుడు, క్రియ, పరస్మై పదములోనున్నది. కురుతే, భజతే యనున వాత్మనే పదములోనున్నవి. మొదటి వాక్యములో కర్త బహువచనమునను, రెండవ వాక్యములోని కర్త యేకవచనమునను నున్నవి. పూర్వము సూచించిన శబ్దప్రక్రమ (అన్వయ ప్రక్రమ) భంగదోషము తొలగిపోనేలేదు-అందుచే మధుసూదనీ వివృతి వ్యాఖ్యా కర్తలీక్రింది విధమున సవరించినారు.

విపదాఽభి భవత్య విక్రమ మభిభూతం విజహాతి చాయతిః
లఘు తేచ్ఛతి తం నిరాయతిం, లఘురాప్నోతి కథం నృపశ్రియమ్

ఇచట 'ఆపంచైవ హలన్తానామ్ యథావాచా నిశాదిశా'యను వాక్యము ననుసరించి విపత్ శబ్దము 'విపదా' యని మారినదని గుర్తింపవలయును.- ఇప్పుడైనను నన్వయ క్రమభంగము పోయినదా?

వచన ప్రక్రమ భేదము

కాచిత్ కీర్ణా రజోభి ర్దివమను విదధౌమన్దవ క్త్రేన్దు లక్ష్మీ
రశ్రీకాః కాశ్చిదంతర్దిశ ఇవదధిరేదాహముదాభ్రాన్త సత్వాః

భ్రేము ర్వాత్యా ఇవాన్యాః ప్రతిపదమపరాః భూమివత్ కంపమానాః

ప్రస్థానే పార్థివానా మశివ మితి పురోభావి నార్యః శశంసుః—

అర్థము :— రజోభిః కీర్ణా = రజస్వలలై, మన్దవక్త్రేన్దులక్ష్మ్యః = తగ్గినముఖమనెడు చంద్రునియొక్క, (లేక చంద్రునిబోలిన ముఖము యొక్క) శోభకలదియై, దివమ్ = ఆకాశమును అనువిదధౌ = అనుకరించెను, పోలియుండెను. ఆకాశము రజఃకీర్ణము = దుమ్ముతో నిండి యున్నది. మన్ద వక్త్రేన్దులక్ష్మ = తగ్గినముఖమును బోలిన చంద్రుని యొక్క శోభకలిగినది—రజః కీర్ణత్వము, మన్ద వక్త్రేన్దులక్ష్మీకత్వము నను శబ్దసామ్య మాకాశమునకును కాన్తకును నున్నది.

కాశ్చిత్ = కొంతమంది స్త్రీలు, దిశః ఇవ = దిక్కులవలె అశ్రీకాః = శోభాహీనలై, ఉద్భ్రాన్త సత్త్వాః = కలవరపడిన మనసు కలవారై, అన్తః = లోపల, దాహమ్ = సన్తాపమును, దధిరే = ధరించిరి. దిక్కులు, అశ్రీకములు = శోభ లేనివి, ఉద్భ్రాన్త సత్త్వములు = తిరుగుచున్న జంతువులు కలవి, అంతః = మధ్య, దాహమ్ అగ్నిని ధరించినవి—అచటనచట నగ్నులు మండుచున్నవి.—అశ్రీకములు—అనుచో నర్థసామ్యము—మిగిలినచోట శబ్దసామ్యమును పూర్వమువలెనే తెలియ వలయును.

అన్యాః నార్యః = ఇతరస్త్రీలు, వాత్యాః ఇవ = గాలులవలె భ్రేముః = తిరిగిరి; అపరాః = ఇతర స్త్రీలు, ప్రతిపదమ్ = అడుగడుగునను భూమివత్ = భూమివలె కంపమానాః = వణకుచున్నవారై, భ్రేముః = తిరిగిరి (కంప మాపుః అని పాఠమగుచో = వణకిరి—అని యర్థము) ఇతి = ఈవిధముగా, పార్థివానాం ప్రస్థానే = రాజులయొక్క ప్రయాణమునందు, నార్యః = స్త్రీలు, పురోభావి = ముందు రానున్న, అశివమ్ = అశుభమును, శశంసుః = సూచన చేసిరి.—

ఇచట మొదటిపాదమున కాచిత్తని యేకవచనమున్నది. మిగి

లీన పాదములలో బహువచనములున్నవి.- కావున వచన ప్రక్రమ భంగము కలిగినది. "కాశ్చిత్కీర్ణాః రజోభిర్దివమను విదధుర్మన్దవక్త్రేన్దు శోభాః" అని కాని, మన్దవక్త్రేన్దు లక్ష్మ్యః"- అని కాని మార్చుచో నీ దోషము పోవును.

మఱియొక యుదాహరణము

'అభివాంఛితం ప్రసిధ్యతు భగవతియుష్మత్ప్రసాదేన' భగవతి = ఓ గౌరి, యుష్మత్ప్రసాదేన = మీ యనుగ్రహముచే, అభివాంఛితమ్ = కోర్కి, ప్రసిధ్యతు = సిద్ధించుఁగాక.-

భగవతి-యని యేకవచనము మొదటనున్నది. యుష్మత్ప్రసాదేన, అనునపుడు యుష్మత్తని బహువచనమున్నది.-అందుచే దోషము వచ్చినది 'భవతీ ప్రసాదేన' అని సవరించుచో నీ దోషము పోవును.

తిఙన్త ప్రక్రమ భేదము

పై శ్లోకమునందే మొదటి వాక్యమున-'అను విదధా' అని క్రియయున్నది. చివరఁగూడ శశంసుః-అని క్రియయే యున్నది. కాని, మధ్య-'కంపమానాః'-అని శానజన్త రూపమేయున్నది. క్రియలేదు అందుచే తిఙన్త ప్రక్రమ భేదము వచ్చినది- 'కంపమాపుః' అని మార్చుచో నా దోషము పోవును.-ఏకకర్తృకము లగుననేక క్రియలున్నప్పుడు, ప్రధానక్రియ తిఙన్తములో నుండి, మిగిలిన యప్రధాన క్రియలు శతృశానజన్తములుగా నుండవచ్చును. క్రియలలో ప్రధానాప్రధాన భేదమున్నపు డీపద్ధతి కుదురును. ఈ శ్లోకమునందు క్రియలన్నియును ప్రధానములే అప్రధాన క్రియలు లేవు. అందుచే కంపమానాః అను శానజన్త ప్రయోగము దోషమేయగును.

కాలవిశేష ప్రక్రమ భేదము

శ్లో॥ సస్నుః, పయః పపు రనేనిజు రంబరాణి,

జక్షు ర్బిసాన్ధృతవికాసి బిసప్రసూనాః

సైన్యాః శ్రియా మనుప భోగ్య నిరర్థకత్వ
దోషప్రవాద మమృజ న్నగనిమ్నగానామ్

అర్థము :- సైన్యాః = సైనికులు (సైన్యములు) సస్నుః స్నానము చేసినారు; పయః = జలమును పపుః = త్రాగినారు; అంబరాణి = వస్త్రములను, అనేనిజుః = ఉతుకుకొనిరి, ధృతవికాసి బిసప్రసూనాః = వికసించిన తామరపుష్పములనుధరించినవారై, బిసాన్ = తామర తూడులను, జక్షుః = తినిరి; నగనిమ్నగానామ్ = పర్వతపు సెలయేళ్ళకు (నదులకు) సంబంధించిన, శ్రియామ్ = సంపదలయొక్క, అనుపభోగ నిరర్థకత్వ దోషప్రవాదమ్ = అనుభవించువారు లేక పోవుటచే, (పర్వతనదుల సంపదలన్నియు) వ్యర్థములను నపకీర్తిని అమృజన్ = తుడిచివేసిరి. పర్వతనదుల సంపదల ననుభవించు వారు లేకుండుటచే నవి వ్యర్థములని లోకములో నొక ప్రవాదమున్నది. సైనికులా సంపదల నన్నిట ననుభవించుటచే నిపుడా ప్రవాదము తొలఁగిపోయినదని భావము.

ఇచట సస్నుః, పపుః- అను క్రియలు భూతానద్యతన పరోక్ష కాలమును తెలుపును. అనేనిజుః అను క్రియ భూతానద్యతనత్వమును మాత్రమే తెల్పును. అమృజ న్ననునదియు నట్టిదే ధృత వికాసి అనునపుడు, భూతార్థమాత్రమున, క్తప్రత్యయ ముపయుక్తమైనది. ఇట్లు క్రియలలోఁ గాల భేదమున్నది-ఈ దోషపరిహారణమునకై శ్లోకము నిట్లు మార్పవలయును.

సస్నుః పయాంసి పపు రంబర మానినేజుః
జక్షు ర్బిసాన్ ధృతవికాసిబిసప్రసూనాః
సైన్యాః శ్రియామనుప భోగ నిరర్థకత్వ
దోషం వనేషు ప్రసభం సరితాం మమార్జుః-

వ్యాఖ్యాత లిచట నింకను విశేషములను వ్రాసినారు. ధృత వికాసి-యనునపుడు-భూతార్థక క్త ప్రత్యయమును గూడఁ దొలఁగించి, ధృతవికాసి బిసప్రసూనాః అనుటకు బదులు "వికచమస్య దధుఃప్రసూనమ్" అని మార్పవలయునని వ్యక్తి వివేక వ్యాఖ్యాతరుయ్యకుఁడు.-

మొదటి పాఠమున, మొదట పయః, చివర దోషప్రవాదమ్- అని యేకవచనములున్నవి. అంబరాణి అని బహువచనమున్నది. రెండవ పాఠమున పయాంసి యను బహువచనము, వెనువెంటనే అంబరమ్ అను నేకవచనమును నున్నవి.-కావున వచన ప్రక్రమ భేదమున్నది. రెండు పాఠములయందును బిసాన్, బిసప్రసూనాః-అని బిసపద పునరుక్తియున్నది-ధృతవికాసి బిసప్రసూనాః అనుచో నన్వయము మొదటి వాక్యమునందలి యన్వయమునకు భిన్నమైనది. అందుచే శాబ్ద ప్రక్రమ భేదమును నున్నది. వీనిని నివారించుటకై మధుసూదనవివృతికర్త యీ రీతిని సవరించినారు.

సస్నుః పయాంసి పపు రక్ష్మపటా న్ని నేజుః
జక్షు ర్బిసాన్ దధురమాని సుమాన్య థైషామ్
సైన్యాః శ్రియా మనుపభోగ నిరర్థతాది
దోషాన్ వనేషు సరితాం ప్రసభం మమార్జుః

(ఇందులో-"అమాని" అనుపదమునకు-ఎక్కువ శోభకలవని యర్థము-నాస్తిమా లక్ష్మీః యేభ్యఃతాని]

ఈకాలవిశేష ప్రక్రమ భేదమును చెప్పుకున్నను నిబ్బంది లేదు. కాలవిశేషమనునది రచయిత యొక్క వివక్షపై నాధారపడియుండుటచే నొక వ్యవస్థను చేయుట సులభము కాదు. వర్తమానసామీప్యే వర్తమానవద్వా అనువాక్య మీ విషయము సూచించును. వ్యాకరణ మహాభాష్యకర్త పతంజలి యీ విధముగఁ జెప్పినాఁడు. "పరోక్షే చలోక విజ్ఞాతే, ప్రయోక్తు ర్దర్శన విషయే దర్శనయోగ్యత్వాత్ పరోక్షస్యా

వివక్షాయాం లజ్ భవత్యేవ–అజయత్ జయన్తో భూతాని''–శబ్దమును ప్రయోగించు నతఁడు చూడకున్నను, చూచుట కవకాశముగల విషయమును చెప్పఁదలఁచినపుడు, పరోక్షత్వమును చెప్పవలెనని లేనపుడును లజ్ వచ్చును.–అని పై వాక్యములకు భావము–ఉదాహరణము–జయన్తుడు భూతములను జయించెను. జయన్తుడు జయించుటను చూచినపుడు గూడ నిచట లజ్ ప్రయుక్తమైనది.

జయన్తుని జయము పరోక్షమునఁ జరిగినదగుటచే నిచట లిట్ ఉండవలయును. కాని లజ్ ప్రయుక్తమైనది. కావున కాలవిశేషము వివక్షాధీనము. అందుచే నిచట కాలభేదమున్నను దోషముగ నెంచనక్కఱ లేదు. ఇటులే యొక వస్తువు యొక్క, అస్తిత్వముగాని శూన్యత్వము గాని వివక్ష పైననే యాధారపడియుండును. ఉదాహరణమునకు 'అనుదరా కన్యా'! 'పొట్టలేని కన్య' కన్యకు పొట్టలేకుండుట యసంభవము–అయినను చిన్న పొట్టయున్నదని చెప్పుటకు బదులుగ పొట్టయే లేదని చెప్పినాఁడు. కవి యిచట ఉదరశూన్యత్వమును వివక్షించినాఁడు. కావున "ననుదరా" యను ప్రయోగము కుదిరినది. ఇటులే గాలవిషయము గూడ వివక్షాధీనము.

శ్లో॥ అర్థస్య తదతద్భావో వివక్షామాత్రతో భవేత్
యత్ర ప్రక్రమభేదోయం నతతోఽద్భావ్యతే బుధైః (30)
యథా విశేష కాలస్య శీలాది ప్రత్యయేషుచ
కర్తుశ్చ ఫలవత్త్వాయాం తేన తేనోప దర్శితాః॥
సంగ్రహశ్లోకములు [31)

తా॥ ఒక వస్తువుండుట లేకుండుట యనునవి వక్తయొక్క వివక్షపై నాధారపడియుండును–అట్టి తావులందు ప్రక్రమ భేదమును సూచింపఁగూడదు. కాలవిశేష విషయమున నుదాహరణమును చూచి

త్రిమి. తాచ్ఛీల్యాది ప్రత్యయ ప్రయోగ విషయమునను, పరస్మైయాత్మనే పదవిషయములందుఁ గూడ నీరహస్యమును గుర్తింపవలయును.

తాచ్ఛీల్యాద్యర్థము వివక్షాధీన మనుట కుదాహరణము.

"జుగోపాత్మాన మత్రస్తో భేజే ధర్మమనాతురః
అగృధ్నురాదదే సోఽర్థ మసక్తస్సుఖ మన్వభూత్"

అర్థము :– అత్రస్తః = భయములేనివాఁడై, ఆత్మానమ్ = శరీరమును, జుగోప = రక్షించెను; అనాతురః = వ్యాధిగ్రస్తుఁడు కాకయే, ధర్మం భేజే = ధర్మమును కూడఁబెట్టెను. (సేవించెను) అగృధ్నుః = లోభశీలము లేకయే, అర్థం = ధర్మమును, ఆదదే = తీసికొనెను, అసక్తః = ఆసక్తిలేకయే, సుఖమ్, అన్వభూత్ = సుఖము ననుభవించెను.

ఇందులో అగృధ్నుః–అనునపుడు తాచ్ఛీల్యార్థక ప్రత్యయమున్నది–అత్రస్తః–అనునపుడు లేదు–అయినను నిచట ప్రక్రమ భేదదోషమున్న దనరాదు.

క్రియాఫలము కర్తృగామియనుట గూడ వివక్షాధీనమే.

"దృష్టా దృష్టి మధో దదాతి కురుతే నాలాప మాభాషితా"

పరస్మైపదమునందున్న క్రియ యొక్క ఫలము కర్తను పొందదనియు, ఆత్మనేపదక్రియా ఫలము కర్తకే చెందుననియు నియమమున్నది. కాని యదియును వివక్షాధీనమే–పై శ్లోక పాదమున కర్థము.

"దృష్టా = చూడఁబడినదై, దృష్టిమ్ = చూపును, అధః = క్రిందవైపుకు, దదాతి = ఇచ్చుచున్నది (పంపుచున్నది). క్రిందకుఁ జూచుచున్నదని భావము–ఆభాషితా = మాట్లాడింపఁబడినదై, ఆలాపమ్, న, కురుతే = మాట్లాడదు.

ఇచట దదాతి–యను క్రియ పరస్మైపదమునను, కురుతే–యను క్రియ యాత్మనేపదమున నున్నది. ఈ రెండు క్రియల ఫలమును నాయికకే చెందవలయునన్నను నాయకునకుఁ జెందవలయునన్నను

రెండును నాత్మనేపదమునవో, పరస్మైపదమునవో యుండవలయును. దదాతియను క్రియకు ఫలము నాయకునకును, కురుతేయను క్రియకు ఫలము నాయికకును జెందుననుట యుక్తముకాదు. కావున నిచట పరస్మయ్యాత్మనే పదముల ఫలములు కర్తను పొందుచు, పొందవను విషయము వివక్షితము కాదనియే యెంచవలయును. వివక్షితము కాకుండుటచే నిచట ప్రక్రమభంగ దోషము లేదు. అందుచే కాలాదులకు సంబంధించిన ప్రక్రమభంగ దోషముల కుదాహరణముల నిచ్చుట లేదు.

కారకశక్తి ప్రక్రమ భేదము

శ్లో॥ గాహన్తామ్ మహిషా నిపానసలిలమ్ శృంగైర్ముహు స్తాడితమ్
ఛాయాబద్ధ కదంబకం, మృగకులం, రోమన్థ మభ్యస్యతు,
విస్రబ్ధం క్రియతాం వరాహతతిభిః ముస్తాక్షతిః పల్వలే
విశ్రాన్తిమ్ లభతామిదంచ శిథిలజ్యాబంధ మస్మద్ధనుః.

అర్థము :- మహిషాః = దున్నలు, శృంగైః = కొమ్ములతో, ముహుః = మాటి మాటికి, తాడితమ్ = కొట్టఁబడిన, నిపాన సలిల మ్ జలాశయములలోని నీటిని (బావిదగ్గఱనుండు తొట్టెలలోని నీటిని లేదా చెరువులలోని నీటిని) గాహన్తామ్ = ప్రవేశించుఁగాక, ఛాయాబద్ధకదంబకమ్ = నీడలయందు గుంపులుగాఁ గూడిన మృగకులమ్ = మృగసమూహము, రోమన్థమ్ , అభ్యస్యతు = నెమరువేయుట నభ్యసించుఁగాక; వరాహతతిభిః = పందుల సమూహముచే, పల్వలే = చిన్న మురికి గుంటలయందు, విస్రబ్ధమ్ స్వేచ్ఛగా, భయములేకుండ, ముస్తాక్షతిః, క్రియతామ్ = తుంగ గడ్డలు కొఱకఁబడుఁగాక (త్రవ్వఁబడుగాక) శిథిలజ్యా బంధమ్ = వదలుగానున్న వింటి నారిగల, ఇదమ్ = ఈ, అస్మద్ధనుః=మా యొక్క ధనుస్సు, విశ్రాన్తిమ్ లభతామ్ =విశ్రాంతిని పొందుఁగాక.

ఇచట మొదటి రెండు వాక్యములును కర్తరి ప్రయోగము నందున్నవి. మూఁడవ వాక్యము కర్మణి ప్రయోగమున నున్నది.— కావున దీనిని కుర్వన్నస్వస్తభియో వరాహతతయో ముస్తాక్షతిమ్" అని మార్చవలయును.

మఱియొక యుదాహరణము

శ్లో॥ కృతవానసి విప్రియమ్ ,న, మే, ప్రతికూలం చ న తే మయాకృతమ్
కి మకారణమేవ దర్శనమ్ విలపన్త్యై రతయే నదీయతే.

అర్థము :- రతీవిలాపము; మే= నాకు, విప్రియమ్ = అనిష్టమును, న, కృతవాన్, అసి = నీవు (మన్మథుఁడు) చేయలేదు; మయాచ = నా చేతఁ గూడ, తే = నీకు ప్రతికూలమ్ = అనిష్టమైన పని, మయా= నా చేత, నకృతమ్ = చేయఁబడలేదు; అకారణమేవ=కారణము లేకయే విలపన్త్యై=ఏడ్చుచున్న, రతయే=రతీదేవికొఱకు, దర్శనమ్ = నీ దర్శనము, న, దీయతే=ఈయఁబడదు ?

ఇచటఁ గూడ మొదటి వాక్యమున కర్తరి ప్రయోగము-రెండవ వాక్యమున కర్మణి ప్రయోగము నున్నది. కావున దీనిని మార్చి, "నచ తేహం కృతవ త్యసమ్మతిమ్" అని చదువ వలయును.

గాహన్తామ్-అను శ్లోకమున గాహన్తామ్ అను క్రియ కర్తృకారకమునకు సంబంధించినది. క్రియతామ్ -అను క్రియ కర్మకారకమునకు సంబంధించినది. కృతవాన్, కృతమ్మనునవి గూడ క్రమముగ కర్తృకర్మకారకములకు సంబంధిచినవియే. అందుచే కారక ప్రక్రమభేదము వచ్చినదని తెలియవలయును.

మధుసూదనీ వివృతి వ్యాఖ్యా కర్త యాత్మనేపద ప్రక్రమ భంగ దోషము కూడ పోవుటకై

"విస్రబ్ధాః అభికర్వతామ్ కిరివరాః ముస్తాక్షతిమ్" అనియును, వచన ప్రక్రమభేదము, ఆత్మనేపద ప్రక్రమ భేదము ననురెండును పోవుటకై.

"ఛాయాబద్ధ కదంబకాః హరిణకా రోమన్థ మాతన్వతామ్"
అనియును సవరింపవలయునని వ్రాసినారు.

మఱియొక యుదాహరణము

సజల జలధరం నభో విరేజే విస్ఫూర్తిమియాయ రుచి స్తడిల్లతానామ్
వ్యవహితరతి విగ్రహైర్వితేనే జలగురుభిః స్తనితై ర్దిగన్తరేషు

అర్థము :- సజల జలధరమ్=నీటితోనున్న మేఘములు కలదై నభః=ఆకాశము, విరేజే=ప్రకాశించినది; తడిల్లతానామ్=మెఱపుల యొక్క, రుచిః=కాన్తి, విస్ఫూర్తిమ్; ఇయాయ=విహరించెను; వ్యవహిత రతివిగ్రహైః=పోఁగొట్టఁబడిన రతికాలకలహములు గలట్టియు జలగురుభిః=నీటిచే బరువైనట్టియు, స్తనితైః=ఉరుములచే దిగన్తరేషు= దిక్కులయందు, వితేనే=వ్యాపింపఁబడినది. మేఘముల యురుములను విని, యింతకుఁబూర్వము కలహించుకొనుచున్న నాయికా నాయకు లభిమానములను వీడి, కలహములను మాని కౌఁగిలించు కొనిరని భావము.

ఇచట, విరేజే, ఇయాయ, అను క్రియలు రెండును కర్తృకారక వాచకములు.-వితేనే యనునది భావే ప్రయోగము. అందుచే కారక శక్తి ప్రక్రమభేదము వచ్చినది. ఇయాయ యనునది పరస్మైపదము. విరేజే-ఆత్మనేపదము. ఈ దోషములన్నియుఁ బోవుటకై యీ శ్లోకము నిట్లు చదువ వలయును. అని మధుసూధన వికృవి వ్యాఖాకర్త యభిప్రాయము.

## గ్రంథస్వీకారము - సమీక్ష.

(బండారు తమ్మయ్య)

1. వ్యాసవాణి:-(రెండవభాగము) కర్త. ఉభయభాషాప్రవీణ జాస్తి వేంకటనరసయ్యగారు ప్రధానాంధ్రోపాధ్యాయులు, చిలకలూరుపేట. ఉన్నతపాఠశాల క్రౌను పుటలు 70 వెల రు 1-0-0.

శ్రీ నరసయ్యగారు సరస జాతీయ కవులు. వీరి యుత్తమ జీవితవృత్తముగూర్చియుఁ గతిపయకృతులగూర్చియు సమీక్ష ఈపత్రిక పూర్వసంచికలు కొన్నిటిలో నొనరించి పరిచయము గావించియున్నాము. వ్యాసవాణి (ప్రథమభాగము) గూర్చిన సమీక్ష పరిషత్పత్రిక దుర్ముఖి మార్గశీర్ష పుష్యమాససంచికలోఁ గాననగును. ఈ రెండవ భాగమున ఆంధ్రజాతి, కవిసన్మానము, ప్రేమ, అభినవతిక్కన, మతము, షేక్ ఫరీదుకవి, ఉపన్యాసకళ, కావ్యగానకళ, విమర్శనకళ, భీమన్నరచనలు అను పది శీర్షికలు గల వ్యాసములు ప్రకటింపఁబడి యున్నవి. పూర్వభాగమందలి వ్యాసములవలెనే, ఇవిగూడ విద్యార్థిలోకమున కెంతయు నుపయుక్తములు. భాషాభిమానుల కెల్ల నాదరణీయములగు శైలితో విషయములతో గ్రథితములయి యున్నవి.

2. గురుదక్షిణ:-ప్రకాశకులు, భారతీసమితి, పాముఋ. కృష్ణాజిల్లా క్రౌను పుటలు 74 వెల రు 1-0-0.

"జాస్తి వేంకటనరసార్యజాతిరత్న జన్మదినమున భక్తిసంజాతములను భావకుసుమాలు హృదయాలఁబరిమళింప ధన్యకవిశిష్యులర్పించు దక్షిణయిది" యను నామముతో శ్రీ నరసయ్యగారి యేఁబది యొకటవ జన్మదినోత్సవసందర్భమున వెలువడినది. ఇంతకుమున్ను పత్రికలలోను నితరత్ర వీరికృతులగూర్చి, గుణగణాదికముల గూర్చి ప్రకటితములయిన కతిపయ ప్రశంసారచనములు, ప్రస్తుత జన్మదినోత్సవమునకయి కొందఱు కవిపండితులు రచించిన పద్యకుసుమములు నిందుఁ గూర్పఁబడినవి. చివరను కవిగారి జీవితచరిత్ర సంగ్ర

హాముగూడ 53-64 పుటలలోఁ గూర్పఁబడినది. "పెద్దలభావములు" అను శీర్షికతో శ్రీ రాధాకృష్ణన్, పండిత నెహ్రూ, ఆచార్య వినోబాభావే మున్నగు పెద్దలు వివిధ విషయములపై ప్రకటించిన మహావాక్యములు ముద్రితములయి గ్రంథశోభ నినుమడింపఁజేయుచున్నవి.

3. మానసప్రబోధము:- కర్త-షేక్ అలీ ఉపాధ్యాయులు హిందూప్రాథమికోన్నతపాఠశాల బాపట్ల, గుంటూరుజిల్లా. ప్రకాశకులు, భారతీసమితి పామఱ్ఱు క్రౌను పుటలు 24,

కవిగారు జాస్తి వేంకటనరసయ్యగారియెడ గురుభావము నెఱపు శిష్యులు. నేఁటిమహమ్మదీయసోదరులలో కవితనెఱపువారిలో నొకరు. ప్రస్తుతకృతి "మనసా" అను మకుటముతోఁ గూర్చిన యొక కంద గీత పద్య శతకము. 108 పద్యములిందుఁ గలవు. గ్రంథారంభమున "సందేశము" అను పేరితో నేఁడు దీనులయెడ నాంధ్రసోదరు లవలంబింపవలసిన ధర్మముల నుద్బోధించు మూఁడు సరస వృత్తములుగూడఁ గలవు. మచ్చున కొకటి రెండు పద్యములు.

కం. ఉత్తము లేకార్యమ్మును జిత్తమ్మున హత్తి దానిఁ జేయఁదలఁప, దు
ర్వృత్తులు చెఱుపంగడగుదు రెత్తులపై నెత్తువైచి యేటికి మనసా (ప32)

గీ. జీవజాలములను సృష్టించి విడిచిన శక్తి దారిఁజూపు జగతి బ్రతుక
నారుపోసి పెంచినీరుపోయని రైతు గలఁడె యెచటనైనఁ గనుము మనస.
(ప 100)

4. మాతృహృదయం:-(గేయకథలు) కర్త ఇల్లూరు నాగమల్లారెడ్డిగారు పులివెందల, కడపజిల్లా. ప్రకాశకులు, భారతీసమితి, పామఱ్ఱు. క్రౌను పుటలు 64 వెల రు 1-0-0.

పరమాత్మనిసృష్టి, మాతృహృదయం, పితృభక్తి, దీపావళి, పాపాయి మున్నగు శీర్షికలతో 25 కథ లిందు గేయరూపమునఁ

తమ "కల్యాణి" పత్రిక "సంతవాణి" అను వార్షికసంచికలోఁ బ్రకటించియున్నారు. వానిలో రమారమి 400 గ్రైకొని దాన్పూదుకవిగారు గీతపద్యములలోఁ గావించిన యనువాదమిది. ఇందలి పద్దియములు గురుడు, వినతి, గర్వము, తత్త్వము, ప్రేమ, సంస్కారము మున్నగు 35 శీర్షికలక్రింద విభక్తములైనవి. జాస్తి వేంకటనరసయ్యగారి కివి యంకిత మొనరింపఁబడినది ("గురుఁడు" నుండి)

"ధరణి కాగితముగ వనతరుచయమ్ము
కలములుగ నేడు సంద్రాల జలము మసిగఁ
జేసి జీవించినన్నాళ్ళు వ్రాసె నేని
గురు గుణప్రజ్ఞ శిష్యుండు కూర్పలేఁడు

(పుష్పదంతశివాచార్యుని మహిమ్న స్తోత్రమందలి
"అసితగిరి సమంస్యాత్ కజ్జలం సింధుపాత్రే"
అను శ్లోకచ్ఛాయ నిది రచితమయినట్లు తోఁచును.)

"ఈ ప్రపంచపుటాసల నీసడించు
నట్టి యోగి జగద్గురుఁ డగునుగాక
ఆశ లుడుపక యోగియౌ నతఁడు లోక
దాసుఁ డగుఁగాక తాఁ జడ దారియగునె."

"అహముదీక్ష" నుండి

"అహము గలనాఁడు నేనుంటి నతఁడు లేఁడు
అతఁడు ప్రత్యక్షమవుడిట నహము లేదు
ప్రణయమార్గము సంకీర్ణ పథముగాన
నిరువు రొకమారు పట్టరా యిరుకుతోవ."

"చాతకము తనబిడ్డకుఁ జదువు చెప్పె
నన్యజలమును గొనవలదయ్య నీవు
స్వాతి బిందులనే నిజ స్వాంతమందు
పట్టుటలు మనకులము స్వభావముగుట."

6. శ్రీ రాచుమల్లు కన్నయ్య సన్మానసంచిక:-ప్రకాశకులు భారతీసమితి, పామఱ్ఱు. క్రౌను పుటలు 52 (వెల తెలియదు)

శ్రీ కన్నయ్య శ్రేష్ఠిగారు చిలకలూరుపేటలో విద్యార్థి వసతి గృహము (Hostel) తటాకము మున్నగు ధర్మప్రతిష్ఠాపనములొనర్చిన వదాన్యశేఖరులు. వీరి షష్టిపూర్తి మహోత్సవసందర్భమున చిలకలూరుపేట పౌరులు, పాఠశాలావిద్యార్థులు, ఉపాధ్యాయులు గావించిన సన్మానములఁ బ్రకటించు సత్కృతి యిది. శ్రేష్ఠిగారి గుణగణాదికములు, ధార్మికజీవితసంగ్రహము నిందుఁ బాగుగాఁ బ్రదర్శింపఁబడినవి. కవిపండితులు పలువురు రచించిన పద్యములు, వ్యాసములు నిందుఁ గలవు. సమయోచితముగ శ్రీ వివేకానందస్వామి మున్నగు విజ్ఞానయోగుల మహావాక్యములుగూడ నిందుఁ బొందుపఱుపఁబడినవి.

(7) ( i) శ్రీ కాశీవిశ్వేశ్వరశతకము క్రౌను పుటలు 21 వెల 0-4 0
( ii) నీతిగీతాలు చిన్నపోకెట్టుసైజు పద్యములు 120 వెల 0-8 0
(iii) స్తుతిగీతాలు ,, ,, వెల 0-4-0

కర్త: విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు ఎం. ఏ. కాకినాడ.

ఇందు మొదటిది కవిగారు కాశీయాత్ర గావించినపుడు భక్తిపూర్వకముగ శ్రీ విశ్వేశ్వరస్వామికంకితముగా మత్తేభ శార్దూలవృత్తములతో రచించినది. రెండవది చాలవఱకు సంస్కృతములో నీతిశాస్త్రమను పేరితోఁ జిరప్రచారమందున్న చిన్ని పొత్తమునందలి శ్లోకములు పెక్కింటికిఁ దేటతెలుఁగున గీతపద్యములలో నొనర్చిన యనువాదము. మూఁడవదానిలో దక్షిణామూర్తి స్తోత్రము, విశ్వేశ్వర స్తుతి, మార్కండేయుఁడొనర్చిన శివస్తుతి, శివపంచాక్షరీస్తుతి, శివస్తుతి, శివాపరాధక్షమాపణస్తోత్రము, భవానీస్తవము. శివస్తవము, నారదపంచరత్నస్తుతి, అర్ధనారీశ్వరస్తోత్రము, శ్రీమృత్యుంజయ మానసిక పూజాస్తుతి, వేదసారశివస్తవము, సువర్ణమాలాస్తోత్రము అను

13 స్తోత్రములతో 100 పద్యములు గలవు. 100 వ పద్యము మాత్రము చంపకమాలావృత్తము. తక్కినవన్నియు గీతపద్యములే. ఆదిశంకరులు సంస్కృతభాషలో మున్నురచించిన చిన్నచిన్న స్తుతుల కనువాదములుగానివి కవిగారిచే సుదాహృతములయినవి. మూఁడింటిని గూడ వీరుగురుచరణారవిందముల కంకిత మొనరించుట ముచ్చటిహాము వారి గురుభక్తి చిరవిశ్రుతము. కవితారచనము మృదుమధురము.

మచ్చున కొకొక్క పద్యము.

(౧) ధర్మార్థంబులు కామమోక్షములు నేతత్పుట్టుణంబామ స
తక్కర్మంబుల్ బహుధా ఫలోన్ముఖత నిస్తంద్రంబులై వెల్గు దం
ద్ధర్మం బెప్పుడు నాల్గు పాదములతో ధన్యంబగున్ ముక్తి స
న్నిర్మగ్నంబులు సర్వకర్మములటన్ దేవేశ! విశ్వేశ్వరా!

(౨) సాంహీనంబైన సంసారమందు
శ్వశురగృహమాను నిజముగా సారమంత
మందుచేతనె హిమవంతునందు శివుఁడు
పాలసంద్రాన విష్ణువుఁ బవ్వళింత్రు.

(3) యోగపరులైన వారలే యోగివరుని
సిద్ధిగనునట్టి వారలే సిద్ధపురుషు
మనములందున ధ్యానింతు రనవరతము
నట్టి భగవంతుఁ గొల్చెద నహరహంబు.

8. పణవిపణి:-(గేయకావ్యము, కర్త, నళినీసుమాన్, కాకినాడ. డెమ్మీపుటలు 144 గేయములసంఖ్య 475 వెల రు 3-0-0.

కృతి కవిమిత్రులు శ్రీ దంటు భాస్కరరావుగారి కంకితము.

"ఈయనంతవిశ్వము రమణీయమ్మగు పణవిపణి, అహోరాత్రముల్ మెఱసెడి యాశాజ్యోతులబరణి" అను కవిగారి వాక్యములే కృతినామకరణమునందలి పరమార్థమును విశదీకరించును. "పణి.

తులు పాచికలుగా జీవితఘట్టములు జూదపుటెత్తులని చిత్రింపనెంచిన భావనా ప్రపంచము'' ఈకావ్యము. అట్టి భావవీచికలలో కవియిందుఁ బహుముఖములుగాఁ దేలియాడుచుండును. "నాకీకావ్యం నచ్చింది" అను పేరితో శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు రచించిన యవతారికకూడ నీవిషయమునే యుద్ఘాటించును. "నీ పుస్తకం చూశాను, చదివిచూశాను, నీహృదయం కొంతలో కొంత నే నెరుగుదును, అందలి ఆవేదన చక్కగా స్పష్టపరిచావు. కదంతొక్కే నీ గేయాలలో ప్రాచీన, నవీనరచనాధోరణులమధ్య స్పష్టమైన వంతెనగా నిలుస్తుంది హృదయోద్గారినీకవిత" అను శ్రీ శ్రీ గారి యభిప్రాయముగూడ నిందుకు పస్కారకము. కవిగారు మునుముందు కావించిన ప్రస్తావనయందలి "ఈపాటలు లోకమ్మును కాపాడుటకా కాదు కష్టజీవులకు సౌఖ్యము కల్పించుటకా కాదు ప్రకృతిలోని నైచిత్రికి పారవశ్యమందిననా కన్నులవిరిసినవెన్నెల వన్నెలుసుమీ యీపాటలు'' అను మాటలే యీ గేయముల తత్త్వమును జాటఁగలవు. మొత్తముమీఁద నీకృతి "An optimist's Pessimism sung in charming Telugu అని కవి వ్రేస్తాన్నాఁడు. గేయరచనమంతయు నొడుదొడుకులులేని పథమున సాఫుగాఁ గొనసాగుట ముదావహము. దృష్టాంతములు కొన్ని చూడఁదగును.

"మిరియపుఁబోడిపానకమున మిశ్రితముగా నారోగ్యము సుఖములలోఁ గష్టమ్ములు సూత్రప్రాయములుగనంతె."

"కష్టములలో సుఖములు కరుణరసమ్మున హాస్యము కాదనుచో వేసవి వడగాడ్పులలో వడగండ్లు."

"కావ్యమ్మున ధ్వని ముఖ్యము కాదన లేరెవ్వరును బుడబుడమను ధ్వని వినఁబడుఁ బుత్రశోకకావ్యమ్మున."

ఆటకట్టు, చదువుసంధ్యలు, గుఱితప్పిన బాణము, సరిపడని సంగతులు, తప్పొప్పులు, యాచుమాషీ, అపశ్రుతి, కొసరులేని బేరము

చైతన్యము అను 9 ఆశ్వాసములుగ నిందలి గేయములు రచితము లయినవి.

9. అమరశ్రీ:-కర్త శ్రీ కొమరవోలు వేంకటసుబ్బారావుగారు, బి. ఏ. పద్యకావ్యము క్రౌను పుటలు 72 వెల రు 1-8-0.

"ప్రత్యూషనామక ప్రబంధకర్తగాఁ బ్రసిద్ధినొందిన యీకృతి కర్త కవితను బ్రత్యేకముగాఁ బ్రశంసించుట యనవసరము. పాఠక లోకమునకది చిరపరిచితమే. ప్రకృతకృతి బౌద్ధమత సంప్రదాయము లందలి మహాయానసంప్రదాయ సిద్ధాంతములకు సంబంధించినది. ఆంధ్రదేశీయుఁడు నాగార్జునుఁడే యీ మహాయానసంప్రదాయమున కాచార్యుఁడు. అతని మాధ్యమికకారిక లీనడుమనే యాంధ్రసాహిత్య పరిషత్తుచేఁ బ్రకటింపఁబడినవి. హీనయానమార్గమునఁ గేవలము భిక్షు కవృత్తితో వైరాగ్య ప్రధానముగనే జీవితము నెఱపుట మానవుని యాదర్శము కాదని, అహింసా ప్రబోధకముగ సంఘసేవ నెఱపుచుఁ బ్రేమమయ గృహస్థజీవనమునఁనే మానవుఁడు పరమార్థమును సాధిం పఁగలఁడని, ఇందలి ప్రతీత్యసముత్పాదశూన్యతా సిద్ధాంతమునందలి ముఖ్యసూత్రము. ఇందువలననే బౌద్ధులు విశ్వ విద్యాలయములు స్థా పించి, పలుతావుల శిల్పకళావైశారద్యమును బహుముఖములుగఁ బ్రకటించి భారతభూమి కపారగౌరవము నాపాదించినది. అశోక చక్ర వర్తి పుత్త్రుడు మహేంద్రుఁడు సింహళదేశపాలకుఁడగు పియతిస్స భూధ వుని పుత్త్రిని, అనుమాకుమారిని బరిణయమై వివాహకాలముననే యామెకు శ్రమణిదీక్ష నొసంగి, తానును దనచెల్లెలు సంఘమిత్త్రయు, భార్యయుఁ గలిసి సింహళద్వీపమున మహాయానబౌద్ధమును బ్రచార మొనరించినకథా విధానమిందలి యితివృత్తము. గ్రంథారంభమున శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారు రచించిన తొలిపలుకు, కృతికర్త విన్న పము కావ్యోద్దేశప్రయోజనములను లెస్సగాఁ బ్రకటించుచున్నవి.

అరణ్యమున వేఁటాడునపుడు సింహళభూధవుఁడొక వ్యాఘ్రిం గనిదానిని బరిమార్ప బాణ మెక్కుడునంతలో నాకస్మికముగ నాతని కచ్చటఁ దారసిలి యా ఘాతుకకృత్యమున కడ్డుదవిలి యాతనితో మహేంద్రుఁడు జ్ఞాన వైరాగ్య బోధకముగఁ గావించిన సంభాషణములు, అటుతర్వాతఁ దనతోడి పరిణయమునకై చిరకాలముగ వేచియున్న యను మాకుమారికి గూడ నీదృశబోధనలనే యొనర్చి వివాహకాలముననే యామెకు దీక్షనొసంగి శ్రమణిగా మార్చిన విధానము నిందుఁ జక్కగా వర్ణితములయి కవిగారి నైపుణ్యమున కాదర్శకములుగ నలరారుచున్నవి.

మహాయాన ధర్మప్రచారమున కాలవాలమై, కళాలయమై శతాబ్దములుగా విలసిల్లిన నాగార్జునకొండ నేఁడు భూదేవిని సస్యశ్యామలముగావించి లోకకల్యాణము గూర్చుటకై తాను నదీగర్భమున నంతర్హితమై భావనామయముగఁ గాక నిక్కముగనే తన చరిత్రమును సార్థకమొనర్చుకొనుచున్న పరిస్థితియే కవిగారికీ కావ్యరచనమున కుద్బోధము కలిగించినది. ఆంధ్రసోదరులెల్ల నత్యాదరముతో నాసక్తితోఁ బఠింపఁదగినకృతియిది. అమరశ్రీనామమునఁ బరగు నీకృతి కమరత్వమునుగూర్పఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక! మచ్చునకుఁ గొన్ని పద్యములు.

గీ. భూతదయయు నహింసయు బుద్ధి జీవి
మానవుఁడొకండె చూపఁగానైన గుణము
లట్టి గుణములు వోనాడు టర్హమగునొ
దానవునిఁబోలె నృపుఁడుంట ధర్మమగునొ.

ఉ. ప్రేమనుబోసి తాలను దర్శింపఁగఁ జేసెడు మీమనస్సునా
ప్రేమ యొడాటమందు విపరీతపు బండయుఁ గొంత యయ్యెఁబో

ప్రేమ యనంగ నెల్లర ద్రవింపఁగఁజేయుటెగాని తానుగా
నేమియు మెత్తగిల్లని ద్రవింపఁగనేరని యగ్నియే ప్రభూ!

గీ. తలఁచునే గింజమొక్కకుఁ దల్లిననుచుఁ
దలఁచునే బిడ్డనని మొక్క మొలచునపుడు
జీవి వికసింప భౌతిక స్థితియెగాక
ఆత్మవస్తువునకుఁ బ్రమేయంబు గలదె.

10. యుగళగీతి:-పద్యకృతి కర్త పరాశరం గోపాలకృష్ణ మూర్తిగారు, ఎం. ఏ. సిద్దిపేట, మెదక్ జిల్లా. క్రౌను పుటలు 32 వెల రు 0-8-0.

సంఘసేవచే జగముద్ధరించెదనను తలంపుతోఁ బెండ్లియాడక యే స్వేచ్ఛగా నుండదలఁచిన కుమారుని యువకు నొకనిని బి. ఏ. పరీక్షకై చదువుచున్నకాలమున, వార్ధకముగదిరిన యాతని తండ్రి వివాహసంబంధము నిశ్చయించితినని వేసవిసెలవులలోఁ బెండ్లి చేసికొనవలసినదని యుద్బోధించును. ఆతఁడందు కిష్టపడక తనభావములను వెల్లడించుటకు సాహసింపనేరక యెట్లో కష్టమున "నా కిదేమి యిష్టముగాదు నాన్న"యనిమాత్రము వెలిబుచ్చెను. అందు కాతని తండ్రి కుపితుఁడయి కొడుకు తనయానతి కెదురు చెప్పుటకు మండిపడి పుత్రుడు వలదన్నను బలవంతముగా బెండ్లిచేసియే యాతనిపొగరడంతునని భార్యతో నుగ్గడించును. విచారముతో భోజనము మాని మంచముపైఁ బరుండిన కుమారునిలేపి తల్లి బుజ్జగించి యన్నము తినిపించి, పెద్దతనమునను తండ్రిగారిమాట ధిక్కరించి వారి నేడ్పించవలదని తాను వలవల నేడ్వఁదొడంగెను. మాతృదేవత దుఃఖమునకుఁ గొమరునిహృదయము ద్రవించి యాతఁడామె కేమియు మాఱు పలుకనేరఁడయ్యెను. ఈమౌనమ ర్ధాంగీకారముగా గ్రహించి యామె భర్తకు విన్నవించును. ఎట్లో వేసవిలో వరునకిష్టములేని యాపెండ్లి

జరిగిపోయెను. భార్య కాఁపురమునకు వచ్చెను. కాని వరుఁడామెయెడఁ బెడమొగముపెట్టి యామెను మనసీయఁడయ్యెను. క్రమముగా నామె పరిపరి విధముల నేకాంతమున నాతని బతిమాలి వేఁడికొనఁగా-

"కనుల నీరులు గ్రమ్మఁగ కాంతమొగముఁ జూచి చూడక యాతఁడు సోదిచాలు తిట్టి కొంచెమయ్యును గూఁత పెద్దదయ్యె నిక్కమే లేదు నీవన్న హృదయమందు" అని తన భావమును బహిర్గత మొనర్చెను. ఒకనాఁటిరేయి మంచముప్రక్కఁజేరి యామె పాద సంవాహనమొనర్చి సపర్యసలుపఁబోవఁ గోపముతోఁ బాదములు ముడిచికొని యామెను మఱింత వగలఁబొగులఁజేసెను. దీనాస్యయై తన ప్రార్థమునకై నిరంతరము చింతిల్లుచు శోకదేవతవలె నింటఁ జరించు నామె మొగమును జూచుకొలఁది నాతనిహృదయము నొత్తవడఁ జొచ్చెను. వాహ్యాళికేఁగునపుడు ప్రకృతిలోఁ గానవచ్చెడు దృశ్యములు, పక్షిదంపతుల కలయికలు, వెలిమబ్బుల యొరయికలు, తరువల్లరుల యల్లికలు మున్నగునవి గూడఁ దమప్రభావము నాతని యెడందపైఁ బఱపి తగిన పరిణతిని గలిగించెను. అంత నాదంపతు లిరువురు పరస్పరానురాగబద్ధులయి "అద్వైతసిద్ధాంత మనుభవించినమాడ్కి సుఖదుఃఖములు రెండు సొలసి మఱచి" సుఖజీవనులైరి. ఇది యీ చిన్ని పొత్తమందలి కథలోని సారాంశము. ఈకృతి తమ ప్రథమ రచనమని కవిగారు మనవి మాటలలో మొదటనే "ఏ కొందఱు సాహితేయులనయిన నలరింపఁగలిగిన నా యీ కృతి కృతార్థయని తలఁతును. సహృదయాః ప్రమాణమ్." అని విన్నవించిరి. ప్రాథమికకృతియైనను గవితారచనము మనోహరముగనే సాగినది. రెండు సర్గములు గానిది రచింపఁబడినది.

"కట్టెవంకను బొయ్యియే కప్పుమగద", మొదలె జాగ్రత్తపడియున్న బుద్ధిరాదె, నోచినమ్మల ఫలితంబు నోచనమ్మల కేలగల్గు"

మొదలగు జాతీయము లందందు సరసముగాఁ గూర్పఁబడినవి.

మచ్చున కొండు రెండు పద్యములు :-

గీ. మగడు చనవిచ్చి ప్రేముడి మదినిజూపి
మనసెఱింగియు మగుడఁ దా మనసునియ్య
నంతకంతెను లోకాన నతివ కేమి
కోరికొనఁదగియుండును గూర్మితోడ.

గీ. కటువుగా నిట్లు మనమునఁ గ్రాఁగఁబలికి
దులుపరించుచుఁ బోయితిఁ దలుపు దీసి
కొనుచు భార్య కన్నీరిడన్ మనసులోన
జాలిపుట్టని నరులును జగతిఁ గలరు

(1) ఏమని సైనఁబెండ్లిని హేయమటంచును మానివేయునే.
(2) నెవ్వగఁ జూచుచున్నడుగ నేరఁడు పాకము వీలుచిక్కమిన్.

ఇట్టులఁ బలుకున్, కూరిమి నిట్టుల నేమిటేమిటో, పిం డారఁ బోసినటులను, ఇత్యాదిప్రయోగములు సంస్కారాపేక్షముగ నున్నవి. ఇటులు, అటులు, ఎటులు మున్నగునవి దుష్ప్రకృతికములగాఁ గాక కళలుగానే గ్రహింపఁదగినవి.

11. శ్రీ సిద్ధేశ్వర చరిత్రము (కాకతీయరాజుల చరిత్ర-ప్రతాపచరిత్ర) ద్విపద కావ్యము-కర్త కాసెసర్వప్ప కవి-సంపాదకులు. శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు-ఎం. ఏ. ఆంధ్రశాఖాధ్యక్షులు - ఉస్మానియా విశ్వవిద్యాలయము. ప్రకాశకులు-ఆంధ్ర రచయితల సంఘము హైదరాబాదు డెమ్మీ పుటలు (10+106+176+12.) 304 వెల రు 6-0-0 లు.

ఏకామ్రనాథుఁడను కవి ప్రతాప చరిత్రమను పేరితో వచనమున వ్రాసిన గ్రంథమునుబట్టి సర్వప్ప కవి రచించిన ద్విపదకావ్యమిది. ఏకామ్రనాథుని గ్రంథమింతకుమున్న ఆంధ్రసాహిత్య పరిష

త్పత్రికయందును, వరంగలులో శైవ ప్రచారిణీ గ్రంథమాలికయం దును ప్రకటితమయినది. కాకతీయుల చరిత్రను గూర్చి పుక్కిటిపురాణ రూపముగ రచితమయిన గ్రంథము చారిత్ర విషయములందుఁ బలు విధముల వ్యత్యస్తమయినవి. యథాతథముగ వానిని జరిత్రకారులు ప్రమాణముగ గ్రహింపఁజాలరు. దానినిబట్టి క్రీ.శ. 1600 ప్రాంతమున రచితమయిన సర్వప్పకవి ద్విపద కావ్యమునకుఁ గూడ నట్టిలక్షణములే పట్టినవి. దీనిననుసరించియే క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దిలో కూచి మంచి జగ్గకవి సోమదేవరాజీయమను పేరిటఁ బద్యకావ్యమును రచించియున్నాఁడు. ఏదో రూపమున లిఖితమయిన కాకతీయుల చరిత్రమను సంభావనము తప్పఁ బ్రామాణ్య విషయమునఁగాని సాహిత్యసౌష్ఠవ విషయమునఁగాని వీనికిఁ దగిన గణ్యతలేదు. అయి నను ప్రాచీన చరిత్ర గ్రంథమువ్వుటచేఁ బ్రాచ్యలిఖిత పుస్తకాలయ మందలి శిథిల ప్రతినిబట్టి సాఫు వ్రాయించి ఆంధ్రరచయితల సం ఘమువారు దీనిని శ్రీ లక్ష్మీరంజనముగారి సంపాదకత్వమునఁ బరిష్క రింపించి మంచి కాగితములపయి చక్కగా ముద్రించి ప్రకటించిఆంధ్ర వాఙ్మయమునకు మహోపకార మొనర్చుట ప్రశంసనీయము. గ్రంథా రంభమున శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు గావించిన ప్రస్తావన, ఉస్మానియా విశ్వవిద్యాలయ చరిత్ర శాఖాధ్యక్షులు డాక్టరు పి. శ్రీనివాసాచార్యులుగారు లిఖించిన మున్నుడి, సంపాద కులు శ్రీ లక్ష్మీరంజనముగారు విశేష పరిశోధన మొనర్చి వైరుధ్య ములఁ బరిహరించి సాధ్యమయినంతవఱకు గ్రంథమందలి పురాణ రూపక చరిత్రాంశములను, ఉపలబ్ధములయిన శాసనాదిక ప్రమాణస్థ విషయములతో సమన్వయ మొనరించుచు యథార్థ చరిత్ర నిరూపక ముగ ఆంగ్లమున రమారమి 100 పుటలలో రచించిన విపుల పీఠిక యమూల్యములయి గ్రంథమున కసాధారణ శోభను గలిగించుచున్నవి.

చరిత్రాభిమానులందఱకిది యవశ్య పఠనీయమని చెప్పనక్కఱలేదు. హనుమకొండయందు వెలసిన సిద్ధేశ్వర స్వామికి, కాకతీయ రాజుల యిష్టదైవమున కంకితముగాఁ దదావిర్భావ కథన పూర్వకముగ దీనిని రచించుటచేఁ గవి దీనికి సిద్ధేశ్వర చరిత్రమను పేరు పెట్టినట్లున్నది. గ్రంథము మూఁడాశ్వాసములు మాత్రము ద్విపదలోఁ గూర్పఁబడినవి. మూఁడవ యాశ్వాసములో రెండవ ప్రతాపరుద్రుని చరిత్ర మసమగ్రముగ నిలిచిపోయినది. పరిశిష్టభాగ మెందుచేతనో రుద్రమదేవి చరిత్రముతోఁ బ్రారంభించి యించుమించుగనే శామనాథుని వచనముల జాడలలోనే వచనముననే రచింపఁబడినది. సిద్ధేశ్వరలింగము, స్థ దేవాలయము సరస్సు, నందీశ్వరుఁడు. అను మూఁడు చిత్రములు గూడ గ్రంథమునఁ జేర్పఁబడినవి. 1924 సంవత్సరములో భారతిలో కీ. శ. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన "కొన్ని కాకతీయ శాసనములు"లోని కాకతీయ చరిత్రాత్మకముగా శైవాచార్యుఁడొకఁడు లిఖించినశిలాశేఖనము, చక్రపాణిరంగనాథుని నయనరగడ గ్రంథము చివర 1, 2 అనుబంధములుగా ముద్రితములయినవి. కృతియందలి ప్రథమాశ్వాసము సర్వప్పకవి స్వయముగాఁ గల్పించినది. హిమాద్రియందు వివాహితులయిన పార్వతీపరమేశ్వరులే హనుమకొండలో సిద్ధేశ్వర, పద్మాక్షీనామములతో లోకకల్యాణార్థమై ప్రమథుల ప్రార్థనము పయి నవతరించినట్టులాతఁడు రచించినాఁడు. తక్కినయాశ్వాసములలో కాకతీయుల చరిత్రము వర్ణితమయినది.

సర్వప్ప కవిత్వమునందు సౌష్ఠవముగాని ప్రౌఢత్వముగాని యంతగాఁగానరావు. బహురూపములనది. దోషభూయిష్ఠముగానున్నది. చారిత్రక గ్రంథమను గౌరవము విడిచి, సాహిత్యవిషయమున దీనికి గణ్యతలేదని ముందే నివేదించియుంటిమి. శ్రీ లక్ష్మీరంజ

నముగారి విపుల పీఠిక యాంగ్లమున కన్ననాంధ్రముననే రచితమయి యున్నచో నాంధ్రలోకమున కెక్కువగ నుపకరించియుండెడిది. ఆంగ్ల పీఠికానంతరము "కాసె సర్వప్ప కవిత్వము" అను శీర్షికతో వారు తెలుగున 10 పుటలలో రచించిన పీఠిక యీ ద్విపద కావ్యమునం దలి గుణదోషములను జక్కగా వివరించుచున్నది. సర్వప్ప వినయ పూర్వకముగ కావ్యారంభమున "శబ్దసంగతులను శాస్త్రాది విధుల। శబ్దలక్షణముల జర్చించి యెఱుఁగ" ఇత్యాదిగాఁ దన యప్రౌఢతను స్వయముగానే చెప్పికొనియున్నాఁడు. కేవలమివి వినయోక్తులుగఁ గాక చాల వఱకు వాస్తవికములుగనే మనము గ్రహింపఁదగును. ఛందోవ్యాకరణ విషయములు రెంటను గూడ నాతని కవితలోఁ బెక్కు దోషములున్నవి. చ. జలలో దంత్యతాలవ్య విభేదమును బాటింపకయే శబ్దములగూర్చి యతిదోషము లెక్కువగ దొరలించి నాఁడు. ప్రాసాక్షరములకు ముందు గురు లఘువులు నిల్పుటలోని నియమములఁగూడ నీతఁడు పలుతావులఁ బాటింపలేదు. కొన్ని కొన్ని పాదములలోఁ బూర్తిగానే యతులు తప్పినవి. వానిని లక్ష్మీ రంజనముగారు సవరించుటకుఁ బూనుకొనక గుర్తుపెట్టి చూపుటతో సంతృప్తి వహించిరి. పూర్వోక్త దోషములకుఁ గొన్ని యుదాహర ణములు.

దుష్టసంధులు

కందువలర్చెను, వర్పప్పనువాఁడ, బిలముదూరటుపోవ. సద్యజీవన్ముక్తి.

యతిదోషములు

( దంత్యతాలవ్య విభేదము పాటింపమి. )

జయభక్త ఫలదాయ శ్రీ గిరిశాయ, చందురుడస్త్రాద్రి చేరిన లీల,
ఛటులత వచ్చెను సిరియాలదేవి, శ్రద్ధ ప్రథమకథిత సేవ్యంబునందు

ప్రా స దో ష ము లు

మదినిసద్గురులుశుక్రాదులు తెల్ప,వనములు చెఱిచియుద్యానముల్ చెఱిచి

పూర్తిగా యతులు తప్పిన తావులు

"కలియుగ గౌరి శర్వ ద్గుణోద్ధారి, ఝాలరుష్విన భక్తు లెల్లర భూతి.

వ్యక్తజనుల దండ వేడ్క లకొండ, నెమ్మిగురుండు హోమాదిసత్కృతులు

ముద మొప్ప వృషభేంద్రుమీఁద నెక్కించి," ఇట్టివి చాల వఱకు శివ కవుల సంప్రదాయము ననుసరించినవిగ గణింపనగునని శ్రీ లక్ష్మీరంజనముగారు సెలవిచ్చిరి. అటులెంచుట సరికాదని మా యభిప్రాయము. శివకవుల యసంఖ్యాత కృతులలోఁ గనరానివి, వారి సంప్రదాయములకు విరుద్ధములైనవి. పెక్కుల పప్రయోగములు సర్వప్ప గావించియున్నాఁడు. దాని కతని శివకవి సంప్రదాయజ్ఞత గాక దోషజ్ఞతా శూన్యతయే ముఖ్యకారణమని యెంచుట సమంజసము

సర్వప్ప సామాన్య శైవుఁడేగాని వీర శైవుఁడు మాత్రము కానేరఁడని సంపాదకులు తలంచినారు. ఇతఁడు కేవల వీర శైవుఁడు కాఁడు గాని అత్తలూరి పాపయామాత్యుఁడు మున్నగువారివలె దశవిధ శైవములలో శ్రౌత, మార్గ శైవములకుఁ జెందిన లింగధారి బ్రాహ్మణుఁడై యుండునని మా యభిప్రాయము. తన తాతను వర్ణించుటలో నీతఁడు "లింగార్చన క్రియానిరతుండు కాసె । గంగాధరుండు, జగత్ప్రసిద్ధుండు" అని వ్రాసినాఁడు. శైవవాఙ్మయములో సాధారణముగా ఇష్ట లింగార్చన విషయముననే లింగావసరము, లింగార్చన, ఇత్యాది విశేషణము లుపయుక్తమైనవి. మఱియుఁ ధనమామ ముదిగొండ దమ్మన్నయని యీతఁడు చెప్పినాఁడు. అనాదినుండి ముదిగొండవారు లింగధారి బ్రాహ్మణులు, తెలుగునాటి యారాధ్య బ్రాహ్మణులలోఁ బేరెన్నికగన్నవారు. కీ శే. మహోపధ్యాయ ముదిగొం నాగలింగశాస్త్రిగారీ శాఖకుఁ జెందినవారే సర్వప్పకవి గూడ నీ శాఖీయుఁడే కానగును.

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుప్పావు

రచన:- శ్రీ దామెర రాజగోపాలరావు

ప్రాప్తిస్థానము
చిత్రాడ
పిఠాపురము పోస్టు

మూల్యము
3-0-0

శ్రీ గోదాదేవి నేటి కించుమించుగ నాలుగువేల యేండ్ల క్రితము 'తిరుప్పావై' అను దివ్యప్రబంధమును తమిళభాషలో భావరాగతాళ సమన్వితముగా గూర్చి గానమునేసిరి. నేడు శ్రీ దామెర రాజగోపాల రావుగారు దానిని ఆస్థాయిలోనే తెనుగునేసి పాడుట మెచ్చుకొనదగినది. లలితపదముల కూరుపు తెలుగునుడికారము ముద్దులమూట గట్టుచున్నవి. లయబద్ధముగ బాడుకొనుట కనువుగ రచన యుండుట సాహిత్యముతోబాటు సంగీతమునను వీరికిగల ప్రౌఢతనము తెల్లమగు చున్నది. 13వ శతాబ్దమునాటి శ్రీ పెరియవాచ్చాం పిళ్లైగారు శ్రీ గోదాదేవి కృతికి దివ్యవ్యాఖ్యానము సమకూర్చిరి. అది అనన్యసామాన్యము. శ్రీ రాజగోపాలరావుగారి రచన దానిని అనుసరించియే నడచినది. అందుచేతనే మూలమునకు మిక్కిలి చేరువగా దెనుగునేత ఒప్పుచున్నది. పెక్కు రచయితలు ఆంధ్రభాషలోనికి అనువాదములు నేసిరి. కాని వానిలో గొన్ని మూలమునకు దూరముగను గొన్ని లయబద్ధములు కాకుండగను ఉన్నవి. ఆ లోపములనుదీర్చి ఈ కృతిని గూర్చి నందులకు ఈ రచయితకు ధన్యవాదములు. పదునెనిమిదవ పాశురములో- "మాధవి పందల్ మేల్ పల్ కాల్ కుయిలినంగల్ కూలినగాణ్" అను చోట "గురివెంద పందిళ్ళ గూయుచున్నవి. సారె గోరువంకలు వింటె?" అని అనువదించుట అపూర్వము. 'కుయిలినంగల్' అనునెడ "కుయిలి" శబ్దమునకు గోయిలనె ఇంత

రణకు ఎల్లరు గ్రహించిరి. కాని ధనుర్మాసమున గోయిలలు కూయుట స్వభావసిద్ధముగాదు; కవి సమయముగాదు. శ్రీ రాజగోపాలరావుగారు ఇచ్చట "గోరువంక" అని అనువదించుట నాకెంతయు సంతసము కూర్చినది. వైష్ణవమతమునగల ఆచార్యభక్తి ఉత్కృష్టత మగ్గడించు నప్పుడు ఆచార్యసాదృశ్యమగు "గోరువంక" పదమును స్వీకరించుటలో శ్రీమద్రామాయణమును గోవిందరాజీయమును రచయిత మనసులో బెట్టుకొని యుండనోపు. శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రతిపాదకమై, జలనిధిమాడ్కి మహాగంభీరమై, అగాధమై తనరు ఈ దివ్య ప్రబంధమును ఆంధ్రలోకమునకు అందించినందుకు శ్రీ రాజగోపాల రావుగారిని ఆశీర్వదింపవలసినదిగా శ్రీ గోదాదేవికి నా నామోవాకములు.

కాకినాడ }
18-9-60 } ఇట్లు,
సంగీత విద్వాన్ :- వింజమూరి వరాహనరసింహాచార్యులు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రాస్థానకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

ప్రధానకార్యదర్శి కోశాధికారి,

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

కార్య నిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి.
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి. (వ్యాకరణవిద్యా,భాషా,ప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య. ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితా విశారద)
6. శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసిక సమ్రాట్)
7. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
8. శ్రీ డాక్టరు ఇవటూరి జోగారావు (యం. బి. బి. యస్.,)
9. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు.

0 శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ,

1. శ్రీ వేదుల రామచంద్రకీర్తి ఎమ్ ఏ.

పత్రికాసంపాదకులు:

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

సంపాదక సహాయులు:

శ్రీ బండారు తమ్మయ్య

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | |
|---|---|
| 1వ సంపుటము | రు 6—0—0 |
| 2వ సంపుటము | 6—0—0 |
| 3వ సంపుటము | 6—0—0 |
| 4వ సంపుటము | 6—0—0 |
| 5వ సంపుటము | 10—0—0 |
| 6వ సంపుటము | 10—0—0 |
| 7వ సంపుటము | 10—0—0 |

7వ సంపుటములో 'వ' తుదివఱకుగల పదములున్నవి రు 10 లు చెల్లించి ఈ సంపుటమును తీసికొనువారికి తరువాతి 'శ హ' భాగము ఉచితముగ పంపఁబడును.

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము

పెక్కు పాఠభేదములతోఁ గూడిన వెనుకటి విషయమంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది వెల రు 1—50

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యానసహితము. మూల్యము రు 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ

Printed by J. Bhaskara Rao at Republic Press Kakinada.
Edited by C. PAPAIAHSASTRY
Published by Andhra Sahitya Parishat, Kakinada.